ప్రవర్తనయొక్క ధర్మాధర్మములను గూర్చికాదు. పార్లమెంటువారేదైన ప్రత్యేక శాసనము జేసినతప్ప దేశములోని సామాన్య ధర్మమును బట్టి బహిరంగసభ లేక సమావేశము, ఏ రాజ్యాంగ మంత్రియొక్క ఆజ్ఞవలనగాని, ఏ ప్రభుత్వాధికారి లేక ఏ మేజస్ట్రేటుయొక్క ఉత్తరువునుబట్టిగాని అశాస్త్రీయము కాజాలదు. దాని నెవ్వరు నిషేధింపవీలు లేదు. అందువలన ప్రభుత్వచర్యలను లిఖిత వ్రాతరూపముగాను, లేక సభలయందు గాను, ప్రజలు నిర్భయముగా ఖండింపగలుగుచున్నారు.

ప్రజలు తమ కష్టనిష్ఠురములను తెలుపుకొనుటకు ప్రభుత్వమునకు ఫిర్యాదుచేసికొనుటకు 'బిల్ ఆఫ్ రైట్సు' అనబడు స్వాతంత్ర్యప్రకటన శాసనమువలన స్థిరపడినది. వ్రాతచనా ముద్రణ ప్రకటన సమావేశ స్వాతంత్ర్యము లిందుకు తోడ్పడు చున్నవి.

పూర్వమువలె ప్రభుత్వము శాశ్వతముగా నొక ప్రతిష్ఠిత సైన్యమును చేతిక్రింద నుంచుకొని ప్రజల నణచుటకు నేడు వీలు లేదు. సైనికవ్యవస్థ ఎప్పటికప్పుడు పార్లమెంటు వారే మంజూరుచేయవలసియున్నది.

ఇట్లు సార్వజనికములగు హక్కు లింగ్లాండులో సామాన్యధర్మసూత్రములుగా స్థిరపడియున్నవి. ఇందులకు విరుద్ధముగా ప్రభుత్వమువారు జరిగించవలెనన్నచో నందుకొరకు ప్రత్యేకశాసనములు చేయవలసియుండును. ఉదాహరణము నకు యుద్ధములు, అశాంతి ప్రబలియున్నప్పుడు దేశములోని

ఆందోళనపరులను, ప్రభుత్వనిరోధులను నిర్బంధింపవలెనన్నచో హేబియస్ కార్పస్ హక్కు తాత్కాలికముగా రద్దుచేయు శాసనమును ముందుగా చేయవలెను. ఇట్టి నిరోధక శాసనములు పార్లమెంటులో ప్రవేశపెట్టినప్పుడు అవి ప్రజాప్రతినిధుల విమర్శకు గురియై మార్పుచెందును. ఇట్టి ఆపన్నాస్త్రముగ గావింపబడిన శాసనములను పురస్కరించుకొని చేయబడిన చర్యలకు ప్రభుత్వోద్యోగులు సివిలు క్రిమినలు చర్యలకు బాధ్యులు గాకుండగా కొన్నాళ్ళకొక 'ఇండెమ్నిటీ' చట్టము అనగా క్షమాపణచట్టము కూడా ప్రవేశపెట్టబడును. అప్పుడును ప్రభుత్వచర్యలు విమర్శింపబడును.

-:o:-

# ప్రజా ప్రభుత్వము

ఇంగ్లాండు స్కాట్లాండు వేల్సు ఉత్తర ఐర్లాండు దేశములు కలిసిన బ్రిటీషు దీవులలో అమలుజరుగుచున్న ప్రభుత్వ విధానమునకు డెమాక్రసీ అనగా ప్రజాప్రభుత్వమని పేరు. ఆ దేశప్రభుత్వము స్వరూపమున రాజరికముగా నున్నను దేశ పరిపాలనము ప్రజాప్రతినిధుల ద్వారా ప్రజాభిమతాను సారముగా జరుగుచున్నది.

దేశమును ప్రజాప్రతినిధుల విశ్వాసమునకు పాత్రులైన మంత్రులు పరిపాలింతురు. దేశమును పాలించుటలోను పన్నులు విధించి రాజ్యాదాయమును రాబట్టుటలోను దానిని ప్రజల క్షేమలాభముల కొరకు ఖర్చుపెట్టుటలోను ఆ దేశ ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమును మన్నింతురు. ప్రజాభిమతము ప్రకారము జరిగింతురు. కేవలము కేంద్రప్రభుత్వమునగల మంత్రులేగాక వారిక్రింద దేశవ్యవహారములను జరిగించు అధికారులును పట్టణములందును పల్లెలందును పనిచేయు ఉద్యోగులును కూడా ప్రజాభిప్రాయమును మన్నింతురు. అక్కడి పరిపాలక వర్గమువారు బాధ్యతతో ప్రవర్తింతురు గనుకనే అది ప్రజా ప్రభుత్వమని వ్యవహరింపబడుచున్నది.

ప్రజాప్రభుత్వమునందు దేశములోని సామాన్య పేదలు కూడా పాల్గొనుట కవకాశములున్నవి. పాల్గొనుట కవకాశము లుండుటయేగాదు, పాల్గొనవలసిన బాధ్యతకూడా ఉన్నది.

పౌరులు ప్రజాప్రభుత్వవ్యవహారములందు పాల్గొని తమ బాధ్యతలను నిర్వర్తింపనిచో ఆ ప్రభుత్వము ప్రజల క్షేమ లాభముల కుపయోగింపదు.

కొందరు పౌరులు కేవలము తమస్వార్థము నాలోచించి దేశాదాయ వ్యయ విధానములను నిర్ణయింపజేసినచో అవి యేవో కొన్ని వర్గములవారికి మాత్రము లాభకరమగునుగాని దేశప్రజలందరికిని లాభకరములుగ నుండవు. అందువలన ప్రజల సమష్టిక్షేమలాభముల నాలోచించి దేశములో పన్నులు విధించి ఆదాయమును రాబట్టు విధానమును, దానిని ఖర్చు పెట్టు విధానమును నిర్ణయింపజేయవలెను. దేశప్రజలలో బల హీనులు, అశక్తులు, దరిద్రులునగువారి శ్రేయముకొరకు స్థితి పరులు అదృష్టవంతులునగు వర్గములవారు తమసౌకర్యములను కొన్నింటిని తగ్గించుకొని హెచ్చుపన్నులను భరించుట కంగీక రింపవలెను. అట్లు చేసినప్పుడే దేశప్రభుత్వము ప్రజాహితైక మగును. అప్పుడే ఆ రాజ్యము ప్రజాహితైక శ్రేయోరాజ్య మగును. పూర్వకాలమున దేశరక్షణమును శాంతి భద్రతలను కాపాడుట న్యాయపరిపాలనము చేయుటయు మాత్రమే దేశ ప్రభుత్వ బాధ్యతలుగా పరిగణింపబడుచుండెను. ఇట్లే న్యాయా న్యాయముల విమర్శనము నిర్ణయములు మాత్రమే న్యాయ శాస్త్రముయొక్క పరమలక్ష్యములుగ పరిగణింపబడుచుండెను.

నాగరిక ప్రపంచమునందు కలిగిన మార్పులవలన ప్రజాసామాన్యమునందు కలిగినమార్పులవలన ప్రభుత్వ లక్ష్య ములందును న్యాయశాస్త్ర లక్ష్యములందును విశాల దృక్పథ మేర్పడినది.

దేశప్రభుత్వముయొక్క లక్ష్యము ప్రజాహితైకశ్రేయో రాజ్య నిర్వహణమని న్యాయశాస్త్రముయొక్క లక్ష్యము ప్రజల సామాజిక ఆర్థిక వైజ్ఞానిక సాంస్కృతిక అభివృద్ధికి దోహదము చేయు ధర్మ నిర్ణయమని ఆధునిక రాజ్యనీతిజ్ఞులును న్యాయ శాస్త్రజ్ఞులును అంగీకరించుచున్నారు. ఇంగ్లాండు దేశ ప్రభుత్వ విధానము న్యాయశాస్త్ర విధానముకూడా ఆధునిక భావముల ప్రభావమువలన మార్పులు చెందినవి. నేడు ఇంగ్లాండు దేశ ప్రభుత్వము ప్రజాహితైక శ్రేయోరాజ్యమును నిర్వహించు ప్రజాప్రభుత్వముగ నున్నది. ఇంగ్లీషు న్యాయశాస్త్రమును దానికి అనుగుణముగనున్నది.

బీదప్రజలపిల్లలకు విద్య, దేశప్రజలందరకును వైద్య సహాయము, గృహవసతుల ఏర్పాటులు, ప్రజలకు జీవనాధారములను గల్పించు వృత్తివ్యాపారముల యొక్కయు, జీవికల యొక్కయు పరిరక్షణము, ముదుసలివారికి, అశక్తులకు, పిల్లలకు, బాలెంతలకు సహాయము, నిరుద్యోగులకు, కార్మికులకు, ఆకస్మికాపాయములచే అశక్తులైన కార్మికులకు జీవనభృతి మొదలగు విషయములున్న ప్రజాసంక్షేమ కార్యకలాపములు శ్రేయోరాజ్య కర్తవ్యములుగ పరిగణింపబడి నిర్వహింపబడు చున్నవి.

ప్రజాప్రభుత్వము కేవలమొక రాజ్యాంగ విధానము లేక పరిపాలనా పద్ధతిమాత్రమే కాదనియు, అది కేంద్రరాష్ట్రము ప్రభుత్వ వ్యవహారములందును పట్టణములందు పల్లెలందు దేశ ములో సన్నిస్థాయిలలోను అన్నివ్యవహారములలోను దేశప్రజలు

అవలంబించు జీవితవిధానమనియు పాశ్చాత్యరాజ్యనీతిజ్ఞు లను చున్నారు.

ఇది కేవలము మంత్రులకు పార్లమెంటు శాసన లకు, ప్రజాసంఘములకు, వాని కార్యనిర్వాహక వర్గములకు, వాని నెన్నుకొను వోటరులకును సంబంధించిన యెన్నికలముచ్చట మాత్రమే కాదు. అట్టి యెన్నికల ఫలితముగా నేర్పడిన గ్రామ పంచాయితీ సభలు, మునిసిపాలిటీలు, సహకారసంఘములు, ప్రభుత్వసహాయముతో పనిచేయు వైజ్ఞానిక సంస్థలు, ఇతర ప్రజా సంస్థలు మొదలుకొని రాష్ట్రశాసనసభలు, పార్లమెంటు సభల వరకును ప్రజ లెన్నుకొను ప్రతినిధులును, వారి విశ్వాసమునకు పాత్రులై దేశపరిపాలనమును జరుపు మంత్రులును, ఇతర కార్యనిర్వాహక వర్గములవారును వారిక్రింద పనిచేయు ప్రభు త్వోద్యోగి వర్గమువారును ప్రజాభిమతానుసారముగ ప్రభుత్వ వ్యవహారములు జరిగించవలసిన గొప్ప బాధ్యతాయుత కార్య నిర్వాహణము.

ప్రజాప్రభుత్వమనునది అనేక విధములైన చక్రములతో నిరంతరముగా పనిచేయు రాజకీయయంత్రము. ఇది ప్రజాభి మతానుసారముగా ప్రజాహితైకముగా పనిచేయుచున్నదో లేదో కనిపెట్టి చూచుచు, దాని కార్యకలాపములలోను నిర్వాహణములోను కనబడిన లోపములను సవరించుటకు, చక్క బరచుటకు, అది సరిగాపనిచేయనిచో వ్యవహారములు చక్క

బడనిచో ప్రభుత్వము వహించిన ప్రాతమంత్రులను పరిపాలక వర్గమును తొలగించి క్రొత్తవారిని నియమించుకొనుటకు నీ రాజ్యాంగవిధానమునందు ప్రజల కవకాశమున్నది. అందువలననే ఇది ప్రజాప్రభుత్వ మనిపించుకొనుచున్నది.

నిరంకుశ ప్రభుత్వములందు రాజుగాని, నియంతగాని, అధికారవర్గమువారుగాని ప్రజల యిష్టానిష్టములతో నిమిత్తము లేకుండా దేశవ్యవహారములు జరుపవచ్చును ప్రజలకు ఆప్రభుత్వమునందు పలుకుబడియుండదు. ప్రజలు తమ యభిమతమును స్వేచ్ఛగా ప్రకటించుటకు వీలుండదు. ప్రకటించినను దానిని పరిపాలకవర్గమువారు పాటింపనక్కరలేదు. వారు ప్రజాభిప్రాయమును పాటించునట్లు చేయుటకు విప్లవముతప్ప మార్గాంతరములు లేవు. ప్రజాప్రభుత్వమునందట్లుగాక ప్రజలు తమ క్షేమలాభములను గూర్చిన అభిప్రాయములను స్వేచ్ఛగా వెల్లడించి అభిప్రాయానుసారముగా పరిపాలనము జరుగవలెనని ఆందోళనము చేయవచ్చును. తాము పార్లమెంటుకు, శాసనసభలకు, ప్రజాసంస్థలకు పంపినప్రతినిధులు తమ యభిమతానుసారముగా ప్రభుత్వము జరిగించునట్లు ఒత్తిడిచేయవచ్చును. తమ యభిమతమును తృణీకరించినమంత్రులు ఇతర కార్యవర్గములవారు రాజీనామానిచ్చి తొలగునట్లుచేసి క్రొత్తవారి నేర్పరచుకొనవచ్చును.

ప్రభుత్వముకూడా ఒక కుటుంబము వంటిదే. ఒక కుటుంబములోని వ్యక్తులు దాని వ్యవహారములందు శ్రద్ధతీసికొని

పాటుపడిన చో వ్యవహారములు చక్కగా జరుగును. వారు శ్రద్ధ తీసికొనక ఉపేక్షించినచో వ్యవహారములు పాడై కుటుంబము విచ్ఛిన్నమగును ఇట్లే గ్రామవ్యవహారములును, పట్టణ వ్యవహారములును రాష్ట్రవ్యవహారములును చక్కగా జరుగుటకు అందలి పౌరులు శ్రద్ధతీసుకొని అప్రమత్తులై పని చేయవలెను. ప్రభుత్వ వ్యవహారము లెట్లు జరుగుచున్నవో గమనించి అవి సక్రమముగా జరుగునట్లు పాటుపడనిచో పరిపాలనము పాడగును. ప్రజా ప్రభుత్వము చక్కగా జరుగుటకు ప్రజాభిప్రాయప్రకటనము చాలా ప్రాముఖ్యమైనది.

సామాన్యపౌరులు ప్రజాసంఘములుగా నేర్పడి, దేశముయొక్క క్షేమలాభముల నాలోచించి ప్రజాభిప్రాయమును ప్రకటించి ప్రభుత్వమువారు వానిని పాటించి నడుచుకొనునట్లు చూడవలెను. దేశపరిపాలనమును చేయుటకు ప్రభుత్వమువా రేర్పరచిన అధికారసంస్థలకు తోడ్పడు అధికారేతర సంస్థలను ప్రజ లేర్పరచి ప్రభుత్వవ్యవహారములు చక్కగా జరుగునట్లు చూడవలెను. ఆవశ్యకతనుబట్టి ప్రభుత్వ సంస్థలతో కలిసి ప్రజాసేవ చేయువలెను. పౌరులిట్లు కృషి చేసినగాని ఈ రాజకీయ వ్యవసాయము ఫలప్రదము కానేరదు. అయితే ఇది యంతయు చేయుటకు తమ కాలమును, సౌఖ్యమును శక్తిసామర్థ్యములను తమతోడి ప్రజల క్షేమలాభములకొరకు వినియోగించి స్వార్థత్యాగముతో ప్రజాసేవచేయు పౌరులుండవలెను.

ఎన్నడో జరుగు ఎన్నికల సమయమున నెవరికో యొకరికి వోటునిచ్చిపంపి కృతకృత్యులైతిమని యుపేక్ష వహించినచో ప్రజాప్రతినిధులుగాని మంత్రులుగాని ప్రజాభిమతమును పాటించి ప్రజాహితైక పరిపాలనము జరిగింపరు. పౌరులు సదా అప్రమత్తులైయుండి ప్రభుత్వ వ్యవహారములను కనిపెట్టి చూచుచు తమ యభిప్రాయములను వెల్లడించుచు తాము పంపిన ప్రజాప్రతినిధులను వారి ప్రతినిధులగు మంత్రులను తమకు బాధ్యతకలిగి ప్రవర్తించునట్లు చేయుచున్ననే ప్రజాప్రభుత్వము సార్థకమగును. ప్రజా ప్రభుత్వమునకు ప్రజాభిప్రాయము ప్రాణమువంటిది.

:o:-

# ప్రజాసంఘములు - ప్రజాప్రభుత్వము

ప్రజాప్రతినిధులవలన ప్రజల క్షేమలాభముల కొరకు ప్రజాభిప్రాయముగా జరుపబడు ప్రభుత్వమే ప్రజాప్రభుత్వము. అందువలన నొక గ్రామమునగాని రాష్ట్రమునగాని దేశము మొత్తముమీదగాని జరుగు పరిపాలనయొక్క మంచి చెడుగులు ప్రజల యప్రమత్తతపైనను అభిప్రాయ ప్రకటనపైనను ఆధారపడియుండును. పట్టణ గ్రామసీమలందు రాష్ట్రములందు నివసించు ప్రజలు అప్రమత్తులై వివేచనము కలిగి ప్రభుత్వ వ్యవహారమును బట్టి దాని నిర్వహణమునందును పాల్గొన్న యెడలనే అది చక్కగా జరుగును.

ప్రభుత్వ వ్యవహారముల మంచి చెడుగులను గూర్చి ఆలోచించినగాని దానినిగూర్చిన అభిప్రాయము లేర్పడజాలవు. ముందుగా ఆయా విషయములను గూర్చిన వివరములు సేకరించినగాని దాని మంచి చెడుగులు నిర్ణయించుకొనుటకు వీలుండదు. అందువలన వాని వివరములను ఆయా ప్రాంతముల ప్రభుత్వములు ప్రకటించు నివేదికలను చదివి ఇతర వివరముల నడిగి తెలిసికొని ఇతర ప్రాంతములందివి ఎట్లు జరుగుచున్నవో తెలిసికొని, దానిని గూర్చి ఒక నిర్ణయమునకు వచ్చి ఆ యభిప్రాయమును అధికారులు మన్నించి గమనించునట్లుగా దానిని వెలిబుచ్చి ప్రకటించి ప్రచారము చేయవలసియుండును.

అందువలన స్థానిక పరిపాలనమునుగూర్చియు రాష్ట్రీయ పరిపాలనమును గూర్చియు కేంద్రప్రభుత్వమును గూర్చియు

తెలిసికొని విషయములను సేకరించి అభిప్రాయ ప్రకటనమును చేయుటకు కొంతకాలమును ప్రజాసేవ కొరకు వినియోగించు టకు ప్రతినిధులను సంసిద్ధుడై యుండవలెను. ఇందుకొరకు గ్రంథాలయములకు పోయి పత్రికలను, గ్రంథములను చదివి విషయములను సేకరింపవలెను. అందులో ప్రవేశింపదలచిన మంచి అభ్యర్థికి వోటిచ్చి పంపవలెను. లేదా తానే ప్రవేశించి పనిచేయవలెను. ఎవరో యొకరు చేయుదురుగదాయని విముఖుడై యుండరాదు.

మొన్న మొన్నటివరకును మనదేశమును విదేశీయులైన ఆంగ్లేయులు పరిపాలించుచుండినందువలన అభిప్రాయ ప్రక టనము స్వేచ్ఛగా చేయ వీలులేకుండెను. అట్లు ప్రకటించినను అది మన్నింపబడుటను సమ్మకముగూడ లేకుండెను. ప్రజల క్షేమలాభముల కొరకు వారు ఏర్పాటుచేసిన సంస్థలందు వారిచ్చిన అవకాశమును వినియోగించుకొని పనిచేయుటకు మాత్రము వీలుండెను. ఏదైనా ప్రజాసేవచేయుటకు పదిమంది కలిసి సంఘముగా నేర్పడి పనిచేయవలెనన్న చో చాలా అడ్డం కులు కలుగుచుండెను. ఇప్పుడట్లు కాదు. ప్రతిపౌరుడును తమ గ్రామ పట్టణ రాష్ట్ర పరిపాలనమునుగూర్చి చర్చించుటకు, అందు పాల్గొనుటకు వీలున్నది. అట్లు చేసిననేగాని ప్రజాప్రభు త్వము సార్థకముకాదు.

పాశ్చాత్యదేశములందు వ్యక్తులు సంఘములుగా నేర్పడి ప్రజా క్షేమలాభములకు తోడ్పడు అనేక కార్యములను నిర్వ హించుచు ప్రభుత్వముతో బాటు ప్రజాసేవ చేయుచున్నారు.

ఒక్క ఇంగ్లాండులోనే సంఘసేవచేయు ప్రజాసంఘములు వందల కొలదిగా నున్నవి. వీని పేర్లు చిరునామాలు వివరించు 'డైరెక్టరీ'లగును సూచికలు ప్రకటింపబడియున్నవి.

ఈ సంఘములలో కొన్ని అంతర్జాతీయప్రజల సౌభ్రాతృత్వమును శాంతిని ప్రచారముచేయునవి. కొన్ని దేశములలో వయస్సు మళ్ళిన స్త్రీ పురుషులలో విద్యను విజ్ఞానమును వ్యవహార జ్ఞానమును అభివృద్ధిపరచుట కేర్పడినవి. మరికొన్ని అనేక విధములుగ సంఘ సేవచేయుట కేర్పడినవి. ఇవి ఒండొంటితో సహకరించి సమితులుగా నేర్పడి దేశసేవ చేయుచున్నవి. ప్రజాసంఘములకు వాని అభిమానవిద్యలకు శాస్త్రములకు వ్యవహారములకు సంబంధించిన ప్రత్యేక గ్రంథాలయములున్నవి కొన్ని ఆయా విషయములనుగూర్చి నిపుణులచేత వ్రాయబడు పత్రికలను కరపత్రములను ప్రకటించును. కొందఱు నిపుణులచేత ఉపన్యాసముల నిప్పించును. అప్పుడప్పుడు అన్ని ప్రాంతములనుండి ఆయా వ్యవహారములకు సంబంధించిన ప్రతినిధులను సమావేశపరచుచుండును. అనేక సంఘములు జనసామాన్యముకొరకు వేసవి పాఠశాలలు రాత్రిపాఠశాలలు విజ్ఞానకేంద్రములు నడుపుచుండును.

ఒకొక్కవ్యక్తి తాను విడిగా ప్రజాసేవ చేయుటకు ప్రయత్నించుటకన్న ఇతరులతో కలిసి సంఘపరముగా హెచ్చు ప్రజాసేవచేయుటకు వీలుండును. తన అభిప్రాయముల నొక్కడే వెల్లడించినదానికన్న సంఘముద్వారా వెల్లడించినచో దానికి హెచ్చువిలువ యుండును. ఒకేవిధమైన సంఘసేవకు

పలుప్రాంతములం దొకేసారిగ చేయుటకు వీలుకలుగును. ఒకవ్యక్తి కేవల మొకకార్యమునందే నిమగ్నుడై యుండుట గాక వివిధసంఘముల ద్వారమున వివిధకార్యములను సాధింపవచ్చును. పురపాలకసంఘమున, సహకారసంఘమున, విద్యాభివృద్ధి కేర్పడిన సంఘమున, దేశయాత్రకు సంబంధించిన సంఘమున, జానపదనృత్యగీతసంఘమున, సంఘ సంక్షేమ కేంద్రమున, ఇంక ననేక సంఘములందు పాల్గొని ప్రజాసేవ చేయవచ్చును. సర్వతోముఖమైన ప్రజాసేవచేయు సంఘములు ప్రజాప్రభుత్వమును సార్థక పరుపగలుగుచున్నవి. ప్రభుత్వమును మరింత ప్రజాహితైకముగ చేయగలుగుచున్నది.

భారతదేశమున కొన్ని వందలేండ్లనుండి ప్రజాహితైకమగు కార్యములను ప్రజలే స్వతంత్రముగ చేసుకొను పద్ధతి పోయినది. ప్రతికార్యమునను ప్రభుత్వము పైననే ఆధారపడు పద్ధతి వచ్చినది. ఇటీవల మన దేశము స్వాతంత్ర్యము పొందిన తరువాత మన ప్రజాప్రభుత్వమువారు దేశములో సంఘక్షేమము కలిగించుటకు విద్యాభివృద్ధిని చేయుటకును సంగీతసాహిత్యకళను పోషించుటకు అనేక విధములుగా ప్రయత్నించు చున్నారు. దానికి అధికారేతర ప్రజాసంఘములు తోడుపడినగాని అవి జయప్రదములుకావు. విద్యాభివృద్ధికి, సంగీతసాహిత్య కళల యభివృద్ధికిని, సంఘక్షేమమునకును ఇంగ్లాండులో చిరకాలము క్రిందటనే స్వతంత్ర ప్రజాసంఘములు, సొసైటీలు, సమితులు ఏర్పడి పనిచేయుచున్నవి.

ఆంగ్లేయ ప్రజాసంఘము లనేక విధములైనవి. అంతర్జాతీయ సౌభ్రాత్రమును పెంపొందించుటకు, ఐక్య

రాజ్యసమితి యుద్దేశ్యములను కొనసాగించుటకు, అట్లాంటిక్ చార్టరన బడు మానవస్వత్వములను సుస్థిరముగా చేయుటకు సంఘము లేర్పడినవి. స్త్రీ పురుషులకు తీరిక వేళలయందు విద్యాభివృద్ధిచేయుటకు రాత్రి పాఠశాలలు నెలకొల్పుటకు, విజ్ఞానాభివృద్ధిచేయుటకు, పౌరధర్మములను బోధించుటకును సంఘము లేర్పడినవి. ప్రజాజీవనమునకు నాటకములకు సన్నిహిత సంబంధ మేర్పడుటకు సినిమాకళను పెంపొందించి అవి ప్రజల నిత్యజీవితమును ఆచార వ్యవహారములను మర్యాదలను స్థిరముగా చిత్రించునట్లు చేయుటకు సంఘము లేర్పడినవి. దేశములోని వివిధ ప్రాంతములందలి జానపద సంగీతమును నృత్యములను సంరక్షించి ప్రజల కాహ్లాదము కలిగించుటకు కొన్ని సంఘములున్నవి. మంచి పుస్తకములను ప్రజల కందుబాటుచేయుటకు సంఘము లేర్పడినవి. పార్లమెంటు వ్యవహారములను ప్రజలకు విప్పిచెప్పుటకు హాన్సార్డు సొసైటీ యేర్పడియున్నది.

నేషనల్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సర్వీసు అను సంఘము వారి కృషిచూచినచో ఇంగ్లాండు ప్రజాసంఘము లెంత చక్కగా ప్రజాసేవ చేయుచున్నది తెలియగలదు. దేశములోని వివిధ ప్రాంతములందలి పల్లెలందు పట్టణములందుగల సంఘము లీ కౌన్సిలుకు ఉపశాఖలుగనున్నవి. దేశములోని అన్నిప్రాంతములందును ప్రజల క్షేమలాభములకు సంబంధించిన కార్యములను చక్కగా నెరవేరునట్లు చూచుటయు, ప్రజాసేవచేయు వివిధ సంఘముల కార్యక్రమము జయప్రదముగా జరుగుటకు తోడ్పడుటయు దీని పని.

దేశములోని గ్రామములందు ప్రజల కుపయోగించు సభా భవనములు 600 నిర్మించుట కిది తోడ్పడినది. ఇంకను రెండు వేల సభాభవనములు నిర్మించుటకు తలపెట్టినది. నేడు మన ప్రభుత్వమువారు స్థాపించిన సంఘ సంక్షేమ కేంద్రములవంటి ప్రజాహితైక సంఘములు గల రూరల్ కమ్యూనిటీ కౌన్సిల్ అను నొక సమితి నీ సంఘమువారు చాలాకాలము క్రిందటనే స్థాపించిరి. గ్రామసీమలందు అడుగంటుచున్న చేతిపనులను వృత్తులను పునరుద్ధరించి గ్రామములందలి వివిధవృత్తులవారి కులవిద్యలను ప్రోత్సహించినవి. గ్రామసీమలందలి స్థానికపరిపాలనము చక్కగా జరుగుటకు ఇవి చాలా కృషి చేసినవి.

పట్టణములందుకూడా ఈ సంఘమువారు 'కమ్యూనిటీ సెంటరు'లను, క్లబ్బులను స్థాపించి ప్రాంతీయజనులను సంఘములుగ కూడగట్టుటకు తోడ్పడిరి. ఇరువదేండ్ల క్రిందటనే ఈ సంఘమువారు కమ్యూనిటీ సెంటరులను స్థాపించి మార్గదర్శకులైనారు. ఇప్పుడీ సంఘమువారు వెయ్యి కమ్యూనిటీ క్లబ్బులకు సలహాదారులైనారు.

ఈ సంఘమువారు 'సిటిజెన్స్ అడ్వైస్‌బ్యూరో' అను దానిని స్థాపించి యుద్ధసమయమున ఆంగ్లప్రజల కెంతో సాయము చేసిరి. దేశములోని యువజనసంఘములవారి యుద్యమమును ఈ సంఘ మేకోన్ముఖము గావించినది. పిల్లల క్లబ్బులను, రయితు పిల్లల క్లబ్బులను వసతిగృహముల సమితిని స్థాపించినది. ఇంతేగాక దేశములోని వృద్ధుల క్షేమలాభములకొరకు నీ సంఘమువారు చాలా పాటుపడి వారికి పెక్కు సౌకర్యములు కలి

గించినారు. ఇట్లే స్త్రీల సంఘములనుకూడ ఏకోన్ముఖమునకు తెచ్చినారు. ఇంకను వివిధ యువతీ సంఘములు, వ్యవసాయదారుల భార్యల సంఘములుకూడ కలవు. ఏ సంస్థలైనను ఏదైన విషయములనుగూర్చిన వివరములుకాని దేశములోని ఏ ప్రాంతమునుగూర్చిన సమాచారము గాని కావలసినచో నీ సంఘమువారు సరఫరా చేయుదురు. ఏ వ్యవహార నిర్వాహణము సంబద్ధైనను ఒక ప్రణాళికను (ప్లానును) తయారుచేసి నడుపవలసినచో వీరే దానిని తయారుచేసి నిర్వహణము చేయుదురు. ఈ సంఘమువారి ఆదాయములో మూడింట రెండునంతులు ప్రజాసంఘములే సమకూర్చును. ఒకనంతు ప్రభుత్వమువారొసగు గ్రాంటులవలన చేకూరును.

మన దేశములో చరిత్ర ప్రసిద్ధములైన కట్టడములు, పురాతన నిర్మాణములు సంరక్షించుట కొక ప్రభుత్వ శాసనము చేయబడి యున్నది. అట్టివానిని రక్షించు బాధ్యతను ప్రభుత్వమువారే వహించినారు. ఇంగ్లాండులో నట్టివానిని సంరక్షించు కార్యము ప్రభుత్వముతో బాటు నేషనల్ "ట్రస్టు" సంఘము వారు వహించినారు. ఈ సంఘము 1895 లో స్థాపింపబడి చక్కగా పనిచేయుచున్నది. ప్రజలకు సౌఖ్యమును ఆనందమును కలిగించుటకు అనువగు ప్రదేశములను సంపాదించి ప్రజల కుపయోగకరముగా చేయుట వీరి పని. అందమైన కొండకోనలు, చిన్న చిన్న వనములు, తోపులు, బయళ్ళు, అపూర్వ జంతు పక్షిజాతులు, వృక్షజాతులుండు ప్రదేశములను, చరిత్ర ప్రసిద్ధములైన పురాతనపు కోటలను, భవనములను వీరు అన్వే

షించి సంరక్షించెదరు. ఇట్టి చిత్ర శిల్పములున్న కట్టడములను వీరు వదిలపరతురు.

సాముదాయక మైదానములు, ఖాళీ స్థలములు, దారులు, డొంకలు కాపాడు సంఘమను పేర ఒక సంఘమేర్పడినది. ప్రజోపయోగములైన ఖాళీస్థలములును, మైదానములును, రహదారులు, దారులు, డొంకలు మొదలైనవానిని స్వార్థపరు లాక్రమింపకుండ వీరు కాపాడుదురు. వీరి కృషివలన పదిలక్షల ఏబదివేల యకరముల విస్తీర్ణము రక్షింపబడినది. స్థానికపరిపాలన సంఘములకు పాఠశాలలకు ఆట బయళ్ళు సంపాదించి పెట్టుటకీ సంఘము తోడ్పడినది. దేశములోని పర్వతములపైకి పోయి వచ్చుటకు వసరులను కలిగించుటకు తోడ్పడినది. ఈ సంఘమునందు వ్యక్తులును, స్థానిక సంఘములును సభ్యులుగా చేరవచ్చును.

ఇంగ్లాండులోని గ్రామపట్టణముల క్రమబద్ధ నిర్మాణమును కట్టుదిట్టముగా చేయుటకేర్పడిన సంఘములును, పౌరులు దేశములో పర్యటించి ఆనందించుటకు సౌకర్యములు కలిగించు సంఘములును కలవు. సైకిళ్ళపై సపోవువారి సంఘముతో పాటు కొండలనెక్కి ఆనందించువారి సంఘములుకూడా కలవు.

"పొలిటికల్ అండ్ ఎకనామిక్ ప్లానింగు సొసైటీ"అనునది చాలా చిత్రమైనది. ఇది స్వయంపోషకమైన స్వతంత్రసంస్థ. రాజకీయములతో దీనికి సంబంధములేదు. ఇందులో కేవలము పరిశోధనము 'రిసెర్చి' చేయుట కేర్పడిన యుద్యోగి వర్గమొకటి స్థిరముగా నియమింపబడినది. దేశములోని పారిశ్రామికులు,

వస్తువినిమయము చేయువారు (Distributors), ట్రేడు యూని యనులవారు, కేంద్రస్థానిక ప్రభుత్వోద్యోగులు, విశ్వవిద్యాలయో పాధ్యాయులు మొదలైన వారిలోనుండి 200 మంది వర్కింగు మెంబర్లుగానుండి తమకు అనుభవముగల ఆయా విషయముల గూర్చి నివేదికలను, వివరణ పత్రములను వ్రాసియిచ్చుచు సహాయము చేయుదురు. దీనినిబట్టి దేశములోని సాంఘిక ఆర్థిక వ్యవహారములను చక్కబరచుటకు అవసరమైన నివేదికలును సూచనలును చేయబడును. 1930 వ సంవత్సరమునుండి ప్రపం చములో నేర్పడిన ఆర్థిక దుఃస్థితి దాని కారణములను తెలిసి కొని దాని చక్కబరచు మార్గముల నన్వేషించుటకు కొంత మంది బుద్ధిమంతులు చేసిన ప్రయత్నఫలితముగా నీ సంఘ మేర్పడినది. ప్రత్తి, ఇనుము, ఉక్కు, పత్రికారచనము, పరిశ్రమ లకు సంబంధించిన ఆవిరియంత్రములు, నూనెతో నడుపు యంత్ర ములు మొదలైన విషయములను గూర్చి పరిశోధించి, దాని ఫలితముగ వీరు గొప్ప నివేదికలను తయారుచేసినారు. ప్లానింగ్ అను పత్రికను మూడువారములకొకపర్యాయము ప్రకటించు చున్నారు. పత్రికకు సాలుకు రెండుపౌనులు చందా.

ఇట్లు అనేకవిధములుగ సంఘసేవయు దేశసేవయు చేయు ప్రజాసంఘము లెన్నో ఇంగ్లాండులో నున్నవి.

## అమెరికా కెనడా దేశముల ప్రజాసంఘములు

అమెరికా సంయుక్త రాష్ట్రములలోను, కెనడారాజ్యము లోను కూడా ఇంగ్లాండునందువలెనే పార్లమెంటులో మూడు

ముఖ్యములైన రాజకీయపక్షములున్నవి. అవి యొక్కడి ప్రజ
లలో రాజకీయాభిప్రాయములకు దోహదముచేయుచుండు
అసంఖ్యాకములైన వివిధ ప్రజాసంఘములకు, ప్రతినిధులుగా
నున్నవి. కెనడాదేశములో క్రైస్తవమత వ్యవస్థకు సంబంధిం
చిన వివిధ సంస్థలును, వివిధ పరిశ్రమలకు, వృత్తులకు, వ్యాపార
ములకు సంబంధించిన ఆర్థిక సమాజములును ప్రజారాజకీయ
జీవనమునకు మూలాధారములుగనుండి వారియభిప్రాయము
లకు దోహదముచేయుచు వారి క్షేమలాభముల కొఱకు పాటు
పడుచున్నవి. ఈ ప్రజా సంఘములు, సమాజములు ప్రభుత్వ
ముతో నెట్టిప్రమేయము లేకుండగనే పుట్టుచు గిట్టుచునున్నవి.
అవి స్థాపించబడుటలోని యుద్దేశ్యములు, అవిచేయు పనులు
ఆయా ప్రజల అక్కరలనుబట్టి యుండును. కాని దేశ ప్రభుత్వ
నిర్వహణమునందు మాత్రము వానికి గొప్పపలుకుబడి యుం
డును. రాజకీయ నాయకులీ ప్రజా సంఘముల కనుసన్నల
మెలగుచుందురు. జనసామాన్యముల యొక్క ఆశయములు,
అభిప్రాయములు వీనియందే యుత్పత్తియై వెలువడుచుండును.
అందువలన కెనడా రాజకీయములందు వీనికొక ప్రధానస్థాన
మేర్పడియున్నది.

కెనడాలోని ఆర్థిక సంఘములెల్ల ఒకపెద్ద గోపురమువలె
అంతస్తు లంతస్తులుగా పెరిగి పెద్దవై ఉన్నత శిఖరమునంటినవి.
కెనడాలోని వివిధ వస్తువులు తయారుచేయు వర్తక సంఘముల
వారెల్లరుగలిసి మాన్యుఫాక్చరర్సు అసోషియేషన్ అను బలమైన
ఆర్థిక సమాజము నొకదానిని స్థాపించుకొనియున్నారు. కెనడా
దేశమున గల మూడు పెద్ద ఇనుపదారుల వర్తకకంపెనీలును

కలిసి మఱియొక సమాజముగా నేర్పడినారు. వడ్డీవ్యాపారము
చేయు బ్యాంకుల వారందరు కలిసి బ్యాంకర్ల సమాజమును
స్థాపించి దేశములో గొప్ప పలుకుబడిని కలిగియున్నారు. ఇవి
గాక కలపవ్యాపారుల సంఘము, అప్పులు తనఖాల వ్యాపార
ముల సంఘము, చిల్లర వ్యాపారుల సంఘము, ఎలివేటర్ల కంపె
నీలు, సారాయములవిక్రయదారుల సంఘము, ఆహారధాన్యములు
పండించువారి సంఘము ముఖ్యముగా దేశములోని రాజకీయ
ములందు బలవంతములై యున్నవి. ఇవి తమ తమ సభ్యుల
క్షేమ లాభములకొరకు పనిచేయుచు, వారి యభిప్రాయముల
నెల్ల క్రోడీకరించి ప్రభుత్వమునకు నివేదించుచుందును. వార్తా
పత్రికలపైన, రాజకీయవిషయములపైన, ప్రభుత్వ నిర్వహణము
నందు వీనికి గొప్పపలుకుబడియున్నది పార్లమెంటులో ప్రవేశపెట్ట
బడు చిత్తుచట్టములనెల్ల ఇవి జాగ్రత్తగా పరిశీలించి తమసభ్యుల
క్షేమ లాభములకు వ్యతిరేకములుగ నుండు భాగములనెల్ల ఖం
డించి తీవ్రముగా విమర్శించును. ఇట్లు తమ క్షేమ లాభము
లకు వలసిన శాసనములను చేయునట్లు పార్లమెంటు "లాబీ"
వరండాలలోని సభ్యులను ప్రోత్సహించును. ఇందుకొఱకే సంఘ
ముల ప్రతినిధులు కొందరు రాజధాని నగరములలో నుండి పని
చేయుచుందురు. దీనికగు ఖర్చు వారు భరింతురు. ఈ సంఘ
ములందెల్ల బలవత్తరములైనవి మాన్యుఫాక్చరర్సు అసోసి
యేషన్, బ్యాంకర్సు అసోసియేషన్ అను సమాజములు. వీనిలో
మొదటిసంఘమునకొక పార్లమెంటరీ కమిటీ, లేక ఉపసం
ఘముకూడా కలదు. కేంద్ర రాష్ట్రీయ శాసనసభలలో ప్రవేశ
పెట్టబడు శాసనములనెల్ల ఈ కమిటీ పరిశీలించి తమకు నష్ట

కరములైన భాగములను గట్టిగా ప్రతిఘటించుచుండును. ఈ సంఘములకు గొప్ప అంగబలము అర్థబలముకూడా ఉన్నవి. అందువలన ప్రభుత్వమునందు హెచ్చుపలుకుబడి యున్నది. బలహీనమైన సంఘముల యభిప్రాయములను ప్రభుత్వము లెక్క చేయదు. కెనడాలో అనేక వ్యాపారములను వృత్తులను జేసి ప్రజలలో సమాజములుగ నేర్పడనివారరుదుగనున్నారు. 1914కు పూర్వము దేశములోని రైతులు సంఘముగా యేర్పడి యుండ నందున వారికి పలుకుబడి లేకుండెను. తరువాత వారొక సమాజముగా నేర్పడి తమ క్షేమ లాభములకొరకు పాటుబడు చున్నారు. దేశములో నెల్లయెడలను కర్షకుల క్లబ్బులను సమాజములను ఏర్పరచి వారి ప్రతినిధులను పైనున్న కేంద్ర సమాజములకంపి పనిచేయుచున్నారు.

కర్షకుల భార్యలుకూడా మహిళా సంఘములుగా నేర్పడి పనిచేయుచున్నారు. వారు ప్రజల ఆరోగ్యమును, విద్యను, నీతిని, అభివృద్ధిచేయుటకు పాటుపడుచున్నారు. వీరు కర్షకుల సుఖజీవనమునకు కావలసిన సౌకర్యములను సంపాదించినారు. గ్రామ పాఠశాలలయందు పిల్లల ఆరోగ్యమును పరీక్షించు పద్ధతిని, వైద్య సహాయముచేయు పద్ధతిని ప్రవేశింప చేసినారు. స్త్రీలకు ప్రసూతి సౌకర్యములు సంపాదించినారు. గ్రామజనుల కుపయోగింపగల విషయములను పాఠశాల విద్యాబోధన ప్రణాళిక లందు చేర్పించగలిగినారు. ఈ స్త్రీలు తమకు సంబంధించిన అనేక విషయములనుగూర్చి కృషిచేసి అనేక సౌకర్యములను సంపాదించగలిగినారు.

కెనడాలోను అమెరికా సంయుక్తరాష్ట్రములలోను ప్రజాసేవచేయు క్లబ్బులనెడి ప్రజాసంఘములనేకములు బయలుదేరి రాజకీయ జీవనమునందు పాల్గొనుచున్నవి. రోటరీక్లబ్బు కెనడా దేశమునందే కాక ఇతర దేశములందు కూడా వ్యాపించినది. కివానిస్‌క్లబ్బు, బాయిస్ స్కౌవుటు, వై. ఎం. సి. ఏ. మొదలైన సంస్థలు చేయు పనులుచేయుచున్నది. ఇవిగాక కెనడాలో దేశభక్తుల సమాజములును ప్రజాసంఘములును కలవు.

—:o:—

# బ్రిటన్‌లో
# సాంఘిక సంక్షేమ కార్యకలాపాలు

ఇంగ్లాండు, స్కాట్లండు, వేల్సు ఉత్తర ఐర్లాండు దేశములు కలిసిన బ్రిటన్ రాజ్యమున సాంఘికసంక్షేమకార్యకలాపములు, అధికారము, అధికారేతరములను రెండు మార్గముల లోను జరుగుచున్నవి. అక్కడ నీ రెండుమార్గములకును అన్యోన్య సహకార సంబంధము లున్నందువల్ల అవి ఫలప్రదములై ప్రజల కుపయోగకరములుగా నున్నవి.

బీదవారికి విద్యాసౌకర్యము, ప్రజలందరికిని వైద్యసౌకర్యము, గృహనిర్మాణము, జీవనాధారమును గల్పించు వృత్తి వ్యాపారములు, ముదుసలివారికి, వికలాంగులు మొదలైన అశక్తులకు, చిన్నపిల్లలకు తగు సహాయము, బిడ్డల తల్లులకును, వారి చంటిపిల్లలకును పోషణము, జబ్బుపడినప్పుడు, పురుడు పోసికొనునప్పుడును, అపాయము కలిగినప్పుడును సహాయము, వితంతువులకును, అశక్తతవలన వృత్తివిరమణము చేసిన వృద్ధులకు, కుటుంబములకు, అలవెన్సులు మొదలైన సాంఘిక సంక్షేమకార్యకలాపములకు బ్రిటన్ రాజ్యము తన ఆదాయములోనుండి సాలుకు 2,500 బిలియను నవరసులు అనగా జనసంఖ్యలో తల 1 కి 65 నవరసులు చొప్పున ఖర్చుచేయుచున్నదని 1960 లో ప్రకటింపబడిన అధికార నివేదికలో నున్నది. పసిపిల్లల విషయమునను, అతివృద్ధుల విషయమునను నిలువనీడ లేని నిరాధారులపట్లను, అశక్తుల విషయమునను శ్రద్ధ

వహించి సంరక్షణ చేయుట, దేశ ప్రజ సాముదాయిక కర్త
వ్యమను సూత్రము ఇటీవల స్థిరపడినది. అందువలన ప్రభు
త్వము సాంఘిక సంక్షేమ కార్యకలాపములు నిర్వహించుట
జరుగుచున్నది. ఇంతకుపూర్వము ఈకార్యభారమువల్ల బ్రిటన్
దేశములోని చర్చి (క్రైస్తవ దేవాలయము) కార్యనిర్వాహక
వర్గములవారే పరమార్థచింతతో జరుపుచుండిరి. ఇంగ్లీషు దీవు
లలో వివిధ ప్రాంతములందుగల క్రైస్తవ దేవాలయ నిర్వా
హకవర్గములవారు ఆయా ప్రాంతములందనేక పాఠశాలలు,
ఆసుపత్రులు, వికలాంగులకును, అశక్తులకును, వృద్ధులకును
శరణాలయములను స్థాపించి నడుపుచుండిరి. ఇంక ననేకధర్మ
కార్యములు నిర్వహించుచుండిరి. అవి యిప్పటికిని జరుగు
చున్నవి. ఇప్పుడున్నట్టివి ఆయా ప్రాంతవాసులకు సరిపోవు
చున్నవో లేదో చూచి సరిపోయినచో ప్రభుత్వమువారు వాని
నాదరించి ప్రోత్సహించుచున్నారు. చాలనిచో తగు ధనసహా
యము చేసి అభివృద్ధిచేయుచున్నారు. ఆ సాంఘికసంక్షేమ
కార్యకలాపము ప్రతిపౌరునికి సరిగా అందునట్లును, అవి రొుక
నిర్ణీత ప్రమాణములో జరుగునట్లును ప్రభుత్వాధికారులు శ్రద్ధ
వహించుచున్నారు.

ఇంగ్లాండు దేశ ప్రభుత్వమువారు సాంఘిక సంక్షేమము
కొరకు నిర్వహించు సేవలకు ప్రజలు స్థాపించిన అధికారేతర
సేవలు తోడ్పడుచున్నవి. అధికార, అధికారేతర సేవలు
ఒండొంటితో పోటీచేయుటగాక పరస్పరసహకార భావముతో
కలిసి పనిచేయుచున్నవి. ప్రభుత్వమువారి సాంఘిక సంక్షేమ
కార్యాలయము ఆయా ప్రాంతముల ప్రజల కష్టసుఖము తెలిగి

పనిచేయు అధికారేతర ప్రజాసంస్థల ద్వారముననే పనులు జరిగించును. ఉదాహరణమునకు, "నేషనల్ అసిస్టెన్సు బోర్డు" అను ప్రభుత్వ కార్యాలయాధికారులు తమ కర్తవ్యనిర్వహణముసందు అధికారేతర సాంఘిక సంక్షేమ సంఘములలో పని చేయు ప్రజాసేవకులకు తోడ్పడుచున్నారు. అంతేగాని మన దేశమునందువలె పూర్వకాలపు నిరంకుశ సాంప్రదాయములతో, అధికారగర్వముతో విర్రవీగుచు, అధికారేతర ప్రజాసేవకులను నీచముగా చూచి వారిని ఈసడించుట లేదు.

ఇంగ్లాండులో ప్రజాసేవచేయు అధికారేతర సంస్థలు చిన్నవి, పెద్దవి కలిసి కొన్ని వేలున్నవి. అందులో కొన్ని సర్వతోముఖ కార్యకలాపములను జరిగించు నుద్దేశముతో స్థాపింపబడి పనిచేయుచున్నవి. కొన్ని కేవలము అంధులసేవ వంటి ఒక ప్రధాన ఉద్దేశ్యముతో ఏర్పడి పనిచేయుచున్నవి.

"నేషనల్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సర్వీసెస్" అనబడు ప్రజా సంక్షేమ సంఘసేవల పరిషత్తు 1919 లో స్థాపింపబడినది. దేశములో సాంఘిక సంక్షేమ కార్యకలాపములను జరిగించు ప్రభుత్వ కార్యనిర్వాహక కార్యాలయములకును అట్టి కార్యకలాపములు నిర్వహించు అధికారేతర సంస్థలకును అనుసంధానములు కలిగించి సాంఘికసంక్షేమ కార్యక్రమములను ఫలప్రదమొనరించుటకీ పరిషత్తు తోడ్పడుచున్నది. పూర్వము 1869 లో స్థాపింపబడిన "చారిటీస్ ఆర్గనైజేషన్" అనబడు ధర్మసంస్థ, ఇప్పుడు "కుటుంబ సంక్షేమసంఘము" అను పేరుతో పనిచేయుచున్నది. కష్టములలోనున్న వ్యక్తులకును, కుటుంబములకును ఈ సంఘము సహాయముచేయును. ఈ సంఘము

లండన్ నగరమునకే ముఖ్యముగా పనిచేయును. అయితే దేశ ములో నున్న వ్యక్తులయొక్కయు, కుటుంబములయొక్కయు కష్టములనుగూర్చి పరిశీలించి సహాయము చేయుటకై దేశములో వివిధ ప్రాంతములందు 180 సంఘము లున్నవి. బ్రిటిష్ దీవుల ప్రభుత్వమువారు సాంఘిక సంక్షేమముకొరకు 1948 జూలై 5 వ తేదీన నొక గొప్ప పథకమును తయారుచేసి యున్నారు. అది యిప్పుడు అమలుజరుగుచున్నది. అందులో నీ క్రింది సేవ లున్నవి :—

(1) కుటుంబ అలవెన్సులు : బ్రిటన్ రాజ్యమున ప్రతి కుటుంబములోను పుట్టిన పిల్లలలో రెండవ శిశువు జన్మించినది మొదలు నిర్బంధవిద్య నేర్పవలసిన కాలపరిమితియైన 15 సంవత్సరముల వయస్సు వచ్చువరకును ఆ బాలబాలిక లప్పటికిని ఇంకను బడిలో చదువుచున్నగాని లేదా ఏదో వృత్తిలో అప్రెంటిసుగా పనినేర్చుకొను ఉమ్మేదువారిగానున్నను 18 వ సంవత్సరము వచ్చువరకును, ఆ రెండవ శిశువుకు వారమునకు 8 షిల్లింగుల చొప్పునను, తరువాత పుట్టిన బాలబాలికలకు ఒక్కొక్కరికి వారమునకు 10 షిల్లింగుల చొప్పునను ప్రభుత్వమువారి బొక్కసమునుండి చెల్లించుదురు.

(2) నేషనల్ ఇన్సూరెన్సు లేక జాతీయభీమా: బ్రిటన్ రాజ్యములో జీవించువారిలో బహుకొద్ది రాబడి వచ్చువారును, అతివృద్ధులును పసిపిల్లలును, వివాహితలైన స్త్రీలును తప్ప తక్కినవారిలో 18 సంవత్సరములకు పైబడిన వయస్సువారందరును ఈ జీవిత భీమానిధికి ప్రతివారును కొంత చందా చెల్లింపవలెను.

పనివారికి వారమునకు వచ్చు వేతనములో నూటికి మూడువంతుల ప్రాప్తిని గమారమి 7 షిల్లింగుల 5 పెన్నీలు చందా నిర్ణయింపబడినది. ఈ జీవిత భీమానిధికి పనివారికి యజమానులును, కొంత చందా చెల్లించవలెను. ప్రభుత్వము వారును ఆయా వృత్తుల ఖాతాకు కొంత చందా చెల్లింతురు. యజమానుల క్రిందగాక స్వంతముగా పనిచేసికొని జీవించు వారును ఈ చందా చెల్లింపవలెను. నిరుద్యోగులు కూడా చందా చెల్లింపవలసియుందురు. ఈ జీవితభీమాను పురస్క రించుకొని ఈ క్రింది సాంఘిక సంక్షేమ సౌకర్యములు కలిగించ బడుచున్నవి. పనిచేసుకొని జీవించు స్త్రీపురుషులు వృత్తి వ్యాపారములు లేక నిరుద్యోగులైనప్పుడును, జబ్బుపడినప్పుడును ఆ భీమాకు చందా చెల్లించినవారికి ప్రభుత్వమువారు అల వెన్సు నిచ్చుచుందురు. స్వతంత్ర వృత్తులు చేసికొని జీవించు వారు జబ్బుపడినప్పుడును అలవెన్సు నిచ్చుచుందురు. గర్భవతు లకు పురుడుపోసికొనుటలో అలవెన్సు నిత్తురు. తల్లిదండ్రులు లేని అనాథబాలబాలికలకు గార్డియన్ అలవెన్సు లిచ్చుచుం దురు. చందాలు చెల్లించినవారిలో వార్ధక్యమువలన వృత్తి వ్యాపారములు చాలించుకొన్నవారికి పింఛనులొసగబడును. అవసరమునుబట్టి స్త్రీపురుషులపై నాధారపడిన బంధువులకును అలవెన్సు లివ్వబడును. 65 సంవత్సరముల వయస్సు వచ్చిన పురుషులకును, 60 సంవత్సరముల వయస్సువచ్చిన స్త్రీలకును పని చాలించుకొన్నచో వృత్తివిరమణ పింఛను లొసగబడును. అప్పటికిని పని చాలించుకొననివారికి మునుముందు హెచ్చు పింఛనులు లభించును. పని చాలించుకొన్నను లేకున్నను

70 సంవత్సరములు వచ్చిన పురుషులకును 65 సంవత్సరములు వచ్చిన స్త్రీలకును, వార్ధక్య పింఛను లొసగబడును. పరిశ్రమలలో తటస్థించు అపాయముల నివారణకుగాను పారిశ్రామిక అపాయ భీమా పనివారందరికీ నిర్బంధముగా నుండును. దానికి వారమునకు 5 పెన్నీలు మాత్రమే చందా. వారికా వృత్తిలో నేదైన అపాయము కలిగి అశక్తత కలిగినప్పుడు, జబ్బుపడినప్పుడు, వృత్తి వ్యాపార నిర్వహణమున ప్రాణములు గోల్పోయినప్పుడును, వారిపై నాధారపడినవారికి సౌకర్యము లొసగబడును.

## 1957 లో జాతీయ భీమా చందాల స్కేలు

| 18 సం. పైబడిన పురుషులు(ఎ) | వ్యక్తి | యజమాని | ప్రభుత్వము |
|---|---|---|---|
| | షి. పె. | షి. పె. | షి. పె. |
| 1. పనిచేయువాడు | 7—5 | 6—2(సి) | 2—0(డి) |
| 2. స్వంతపనిచేసి జీవించువాడు | 9—8(ఇ) | — | 2—6 |
| 3. నిరుద్యోగి | 7—4(ఇ) | — | 1—10 |

ఒసగబడు సంక్షేమ సహాయము :-

| | అవివాహితులు | వివాహితులు | ఒకొక్కొక్క బాలబాలికకు. |
|---|---|---|---|
| పనిలేనప్పుడు, జబ్బులో | 40-0 | 65-0 | 11-6 (ఎఫ్) |
| పారిశ్రామిక అపాయము | 67-0 | 92-6 | 11-6(ఎఫ్) |

ఎ. 18 సం.లు దాటిన స్త్రీలు మగవారి చందాలో 4/5 వంతు చెల్లింపవలెను. 18 సం. లోపువారు తక్కువ చెల్లింతురు.

బి. పారిశ్రామిక అపాయభీమా చందా 5 పెన్నీలు. ఆరోగ్యసేవ చందా 1 షిల్లింగు 4½ పెన్నీలు ఇందులో చేరియున్నవి. మొత్తము చందా 7 షిల్లింగుల 5 పెన్నీలు. శ్రామికునికి వారమునకు వచ్చు వేతనములో నూటికి 3 వంతులని అంచనా (వేతనము 245 షిల్లింగుల 7 పెన్నీలు).

సి. పారిశ్రామిక అపాయ భీమా 6 పెన్నీలు, ఆరోగ్యసేవ చందా 8½ పెన్నీలు.

డి. పారిశ్రామిక భీమా చందా సుమారు 2 పెన్నీలు చేరియున్నవి.

ఇ. ఆరోగ్య సర్వీసు చందా 1షి. 8 పెన్నీలు చేరినవి.
ఎఫ్. కుటుంబ అలవెన్సు వచ్చునప్పుడు 3 షి. 6 పె.

(3) నేషనల్ అసిస్టెన్సు గ్రాంట్లు లేక అలవెన్సులు అనునవి కష్టములోనున్న వ్యక్తుల అవసరమునుబట్టి ప్రభుత్వమువారేర్పరచిన స్కేలు ప్రకారము ఒసగబడును. ఈ విధానము క్రింద కొన్ని సాంఘిక సంక్షేమ సర్వీసు లేర్పరుపబడియున్నవి. ఇందులో ముసలివారికి, అశక్తులకు ఆశ్రయములు, నిలువనీడ లేనివారు తలదాచుకొనుటకు సౌకర్యములు చేరియున్నవి. నేషనల్ హెల్తు సర్వీస్ అను జాతీయారోగ్య సేవావిధానముక్రింద బ్రిటన్ దేశములో నివసించువారందరికిని వారు జాతీయ భీమానిధికి చందాచెల్లించువారైనను కానట్టివారైనను ఎట్టి విచక్షణయును లేకుండా ఉచిత వైద్యసహాయము చేయబడుచున్నది.

(1) జనరల్ ప్రాక్టీషనర్ సర్వీసు అనగా సామాన్య వైద్యము చేయు డాక్టరు సహాయము. ఇందులో కుటుంబ వైద్యుని సేవ, దంతవైద్యము, కండ్లవైద్యము, సులోచనముల సరఫరా సహా - ఫార్మస్యూటికల్ సర్వీసు అనగా అవసరమైన మందుల సరఫరా.

(2) ఆసుపత్రి సహాయము, స్పెషలిస్టు సర్వీసు లేక వైద్యశాస్త్ర ప్రవీణుల సహాయం, చేరియున్నవి. ప్రసూతి చికిత్సాలయములోను, దీర్ఘవ్యాధి చికిత్సాలయములందును వ్యాధి చికిత్సానంతరము ఆరోగ్యము, బలము చేకూరుట కవసరమైన సహాయము, (Rehabilitation Centre) పునరావాస కేంద్ర సహాయము, వైద్యసంస్థలందుగాని ఇంటివద్దనేగాని ప్రవీణవైద్యుని సహాయముపొందుట, అవసరమైనప్పుడు క్రొత్త రక్తము నెక్కించు చికిత్స, రోగనిర్ణయ ప్రయోగశాల సహాయము మొదలైన సౌకర్యములందు చేరియుండును. అనగా భారతదేశములో ధనవంతులకు తప్ప సాధ్యముగాని వైద్య సహాయ మక్కడ బీదలకు సైతము సులభసాధ్యమైనది.

(3) స్థానిక ఆరోగ్యాధికార సర్వీసులు (Local Health Authority Services) ప్రసూతి వైద్యము, శిశు సంరక్షణము, రోగములు రాకుండా ముందు జాగ్రత్త తీసికొని నివారించు పద్ధతులు, టీకాలు వేయుట, అంటురోగముల నివారణ (Immunization), ఆరోగ్య తనిఖీ, గృహములందు రోగి శుశ్రూష లేక 'నర్సింగ్', రోగులసంరక్షణము (Care and after care) అంబ్యులెన్సు లేక రోగుల తరలింపు, ప్రయాణ

సౌకర్యములు మొదలైన సహాయము లిందులో చేరి యుండును.

ఇందులో ఏవైద్యసహాయ సర్వీసునైనను పొంద వచ్చును. తన కిష్టమునచ్చిన వైద్యుని తన కుటుంబ డాక్టరుగా నియమించుకొనవచ్చును. అయితే డాక్టరు దానికి అంగీకరింపవలెను.

ఈ నేషనల్ హెల్తు సర్వీసులో పాల్గొను డాక్టరులు స్వంత వైద్యవృత్తి కూడా చేసికొనవచ్చును. ఇంగ్లాండు స్కాట్లండు, వేల్సు, ఉత్తర ఐర్లండు రాజ్యములలోని 510 లక్షల ప్రజలలో నూటికి 97 మంది ఈ సర్వీసు సహాయమును పొందుచున్నారు. ఇందులో నూటికి 98 వంతులు జనరల్ ప్రాక్టీషనరులును, ప్రవీణ డాక్టర్లలో చాలామందియు, దంత వైద్యులలో నూటికి 94 మందియు, మందులుతయారుచేయు కెమిస్టులందరును ఈ విధానమున చేరియున్నారు. ఇందుకైన ఖర్చులలో చాలాభాగము ప్రభుత్వమువారే భరింతురు. ఈ సేవలో చాలా తక్కువ పద్దులనే రోగులు భరింతురు. ఔషధములను నిర్ణయించి వ్రాసియిచ్చు నమూనాపత్రములు ప్రిస్క్రిప్షన్ ఫారమున కొక షిల్లింగును, దంతవైద్యమున కొక సవరనును, పళ్ళు కట్టించుకొనినందులకైన ఖరీదులో కొంతభాగమును మాత్రం రోగి భరింపవలసియుండును. కొందరి కీ ఖర్చు కూడా లేకుండా చేయుటకును వీలున్నది.

ఇతర సాంఘిక సంక్షేమ సర్వీసులు:

ఇండ్లు వాకిండ్లు లేని పిల్లల సంరక్షణముచేయుట, చిన్నవారికిని, అశక్తులకును పనికల్పించుట, ప్రత్యేక సౌకర్యములు

కలిగించుట, వికలాంగులకు పునరావాసము కలిగించుటయు ( rehabilitation of the disabled ) ఉచితముగా పాలసర ఫరా చేయుట, పాఠశాలలందు చదువుకొను బాలబాలికలకు ఉచితభోజనము, తల్లులకు, శిశువులకు ఉచితముగా పాలసర ఫరా చేయుట, కొన్ని సందర్భాలలో న్యాయశాస్త్ర సలహా సహాయమును చేయుచున్నారు. ప్రభుత్వాధికార సంస్థలతో సహకరించు అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమములు నిర్వహించుచున్నవి. స్థానిక మునిసిపలు సంస్థలు ఆయాప్రాంతములందు తగిన విద్యాసౌకర్యము లేర్పాటుచినవి. 5-15 సంవత్సరముల మధ్యవయస్సువారికి నిర్బంధోచితవిద్య నేర్పబడుచున్నది. ఈ దేశములోని పాఠశాలలందు మూడవవంతు చర్చి అధికార వర్గములవారు స్థాపించినట్టివే. కొన్ని పాఠశాలలకు కేంద్ర ప్రభుత్వ శాఖవారు గ్రాంటులిచ్చి, సహాయము చేయుచున్నారు. అన్ని పాఠశాలలపైన ప్రభుత్వ తనిఖీ యున్నందున లోటుపాటులు సవరింప వీలున్నది.

దేశములోని 722 విశ్వవిద్యాలయములలో 91,000 మంది విద్యార్థులు పూర్తి కాలపరిమితిలో చదువుకొనువారున్నారు. కొంత కాలపరిమితిలో మాత్రము చదువుకొనువారిందు చేరలేదు. విశ్వవిద్యాలయములలో చదువుకొను విద్యార్థులలో నూటికి 70 మందికి పబ్లికు నిధులనుండిగాని ప్రయివేటు నిధులనుంచిగాని విద్యార్థి వేతనము లొసగబడుచున్నందున సామాన్య ప్రజల పిల్లల కున్నతవిద్య అందుబాటులో వున్నది. విశ్వవిద్యాలయముల ఆదాయములో నూటికి మూడువంతులలో రెండువంతులు ప్రభుత్వమువారు గ్రాంటులుగా నిచ్చు

చున్నారు. వాని అంతరంగిక వ్యవహారములందు జోక్యముకలి గించుకొనకుండువలన వానికి స్వాతంత్ర్యమున్నది. ఇదిగాక దేశమంతా టెక్నికల్ కాలేజీలు కొన్ని వందలున్నవి. ఇందులో సాంకేతిక వృత్తివిద్య నేర్పుదురు. ఇవి విశ్వవిద్యాలయములతో తులతూగు విద్యను బోధించుచున్నవి. గృహనిర్మాణము, టౌన్ ప్లానింగు లేక పట్టణ నిర్మాణము కూడా సాంఘిక సంక్షేమ కార్యకలాపములతో చేరినపనులుగా వున్నవి. రెండవ ప్రపంచ యుద్ధానంతరము 1945–56 మధ్య 250 లక్షల నూతనభవనము లును, గృహములును నిర్మింపబడినవి. వీనిలో చాలాభాగము ప్రభుత్వసహాయముతో నిర్మింపబడినవి. 1954 నుండి పట్టణ ములలో మారుమూల సందుగొందులందలి మురికిపేటలు శుభ్ర పరచి ఆరోగ్యకరనిర్మాణములు చేయుటకు గృహనిర్మాణసంస్థలు కృషి చేయుచున్నవి. రెండవ సంగ్రామానంతరము వివిధపట్టణ ముల పునర్నిర్మాణమునకు, గ్రామసీమల పునర్నిర్మాణమునకు కొన్ని శాసనవిధులు చేయబడినవి. కొత్తపట్టణముల నిర్మాణ చట్టములు బట్టి మహానగరములగు లండన్ గ్లాస్గో పట్టణముల లోని జనాభా యొత్తిడిని తగ్గించుటకును, ఇతర పారిశ్రామిక ప్రాంతములందలి జనాభాయొత్తిడిని తగ్గించుటకును 15 క్రొత్త పట్టణములు నిర్మింపబడి అందులో జనులు సుఖముగా జీవించు టకు అవకాశములు కలిగించిరి.

ఇంగ్లాండును చూచి మన ప్రభుత్వం నేర్చుకొనవలసిన అంశములలో నీకార్యక్రమ మొకటి.

# పార్లమెంటరీ డెమాక్రసీ లేక పార్టీప్రభుత్వము

## ప్రజాప్రభుత్వ మెట్లు అమలు జరుగును ?

ఒక రాజకీయ పక్షమువారు అధిక సంఖ్యాకులుగా ప్రజాసభ కెన్నుకొనబడగా, వారిలోని ముఖ్యులు మంత్రులై ప్రభుత్వాధికారము వహించి దేశపరిపాలనమును జరుపుదురు. అప్పుడు ప్రజాసభలోని ప్రతిపక్షమువారు, అధికారము వహించిన ప్రభుత్వ పక్షమువారి లోపములను, వారి తప్పిదములను కనిపెట్టుటకు సదా అప్రమత్తులై యుందురు.

పరిపాలనా విషయములనుగూర్చి సభలో ప్రశ్నించుట, పబ్లికు పాలసీ అనగా పరిపాలనా విధాన క్రమమునుగూర్చి సభలో చర్చలు జరుపుట, ప్రభుత్వమువారు తలపెట్టిన ప్రతి చిత్తు శాసనముయొక్క నిబంధనలను జాగ్రత్తగా పరిశీలించి విమర్శించుట, బొక్కసమును డీ ప్రభుత్వమువారు వ్యయము చేయదలచిన ప్రతి ఖర్చు పద్దుయొక్క అవసరమును ఔచితిని జాగ్రత్తగా పరిశీలించి విమర్శించుట మొదలైన అనేక మార్గముల ద్వారమున ప్రభుత్వ యంత్రముయొక్క నడకను బహు జాగ్రత్తగను నిరంతరముగను ప్రతిపక్షమువారు కనిపెట్టి యుందురు. ప్రజాసభలో ప్రభుత్వపక్షమువారి కెంత అధిక సంఖ్యాక బలమున్నను పై పరిస్థితులలో నే విషయమునందును

నిరంకుశముగ చలాయించుటకు వీలులేదు. తమ బాధ్యతను తప్పించుకొనుట కెంతమాత్రమును వీలులేదు. ప్రభుత్వ వ్యవహారములనుగూర్చిన వివరములు కేవలము మంత్రులకును వారి పక్షము వారికిని మాత్రమే తెలిసియుండి ఇతరులకు తెలియ గూడదను రహస్య విధానమునకు తావులేదు. ప్రజల క్షేమ లాభములకు సంబంధించిన వ్యవహారములను గోప్యముగ నుంచుట కవకాశము లేదు. అట్టి వ్యవహార నిర్వహణమునకు సంబంధించిన పద్ధతులు (Policies) నిర్ణయమునందుగాని దాని నిర్వహణమునకు సంబంధించిన వివరములుగాని రహస్యముగ నుంచుటకు వీలు లేదు.

ఒకమారొక రాజకీయ పక్షమువారు, నింకొకమారింకొక రాజకీయ పక్షమువారును ఒకరి తరువాత నొకరు ప్రభుత్వము వహించి దేశ పరిపాలనమును జరిగించు రాజ్యాంగపద్ధతి ఇంగ్లాండులో చిరకాలానుగతముగ నేర్పడిన ప్రజాప్రభుత్వ పద్ధతిగా నున్నందునను ప్రతి విషయమునందును పూర్వపు మర్యాదలును ఆచారములును స్థిరరూపముగ నేర్పడియున్నందునను ఏ పక్షము వారును హద్దుమీరి ప్రవర్తింపరు. రాజకీయమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యములతో పాటు ప్రభుత్వాధికారము ప్రజాధీనముగనుండి రాజ్యాంగ ధర్మము సక్రమముగ నడుపబడును. అధికారములోనున్న రాజకీయపక్షవారేమాత్రము హద్దుమీరి చరించినను ప్రజాభిప్రాయము వారికి వ్యతిరేకమై, వారిని హద్దులో నుంచుటకు అప్రమత్తత వహించియున్న ప్రతిపక్షమువారధికారములోనికి వచ్చుట తటస్థించుచుండును.

## పార్లమెంటు సభ్యుల కర్తవ్యములు

ఇటీవల బ్రిటిషు లేబరు పార్టీలో ప్రముఖుడైన అన్యూరిన్ బెవిన్‌గారు ఇంగ్లాండు పార్లమెంటరీ లేబరుపార్టీ నాయకుడైన సి. ఆర్. అట్లీగారి అధికారమును ధిక్కరించెనను నేరమునకు ఆయనను పార్లమెంట్ లేబరుపక్షమునుండి తొలగించినారు. ఆయనకుగల పలుకుబడినిబట్టి లేబరు పక్షములోనుండి తొలగించలేదు. దీనిని గూర్చిన వాదోపవాదములు ఇంగ్లాండులో చెలరేగినవి.

పార్లమెంటు వ్యవహారములలో 30 సంవత్సరముల అనుభవము కలిగి కన్సర్వేటివు పక్షమువారి నాయకుడై ఇంగ్లాండు ప్రధానామాత్యుడుగా నున్న సర్ విన్‌స్టన్ చర్చిల్ గారు వుడ్‌ఫర్డులో నొక సభయందు మాట్లాడుచు 28-3-55వ తేదీన పార్లమెంటుసభ్యుల పరమ ధర్మమునుగూర్చి, రాజకీయ పక్షముపట్లగల బాధ్యతనుగూర్చి వివరించినాడు.

"తన అంతరాత్మకు ఏది మంచిదని తోచునో, తన కత్యంత ప్రేమ పాత్రమైన మాతృదేశము యొక్క క్షేమమునకును గౌరవమునకును ఏది అవసరమని తనకు తోచునో, అ చేయుటయే పార్లమెంటు సభ్యుని ప్రథమకర్తవ్యము, పరమ ధర్మము. అతని రెండవ కర్తవ్యము తనను పార్లమెంటు కెన్నుకొనిన నియోజక వర్గమువారి పట్ల బాధ్యత వహించియుండుట. అతడు వారి క్షేమలాభములనుగూర్చి వారి తరఫున పనిచేయుట కెన్నుకొనబడిన ప్రతినిధి ( Representative ) యే గాని వారేది చేయుమన్న అది చేయు పద్ధతిపై నియుక్తుడైన ప్రతి

నిధి (Delegate) కాదు. తా నే రాజకీయపక్షమునకు చెంది యున్నాడో ఆ పక్షమువారికిని వారి ప్రోగ్రామునకును కట్టు పడి యుండవలసిన బాధ్యత తుట్టతుదకు అతడు నిర్వర్తించ వలసిన దేశాని పై రెండింటిని మించినదిగాదు."

ఈ రాజ్యాంగ మర్యాదనే ఇంగ్లాండులోని అన్ని రాజకీయ పక్షములకు చెందిన పార్లమెంటు సభ్యులును పాటించు చుందురు.

9]

# గ్లాడ్‌స్టన్ మంత్రి స్థాపించిన సంప్రదాయములు

ఇంగ్లాండు దేశపు రాజకీయ చరిత్రయందు ప్రసిద్ధికెక్కిన మంత్రులు, మన రాజకీయనాయకులవలె ఒక్కసారిగా మంత్రిపీఠముల నధిష్టించినవారు కారు. వారు, పార్లమెంటు సభ్యులై కొన్ని సంవత్సరములపాటు ప్రజాసేవ చేసి, అనుభవము సంపాదించి క్రమక్రమముగా మంత్రివర్గమునందలి చిన్న చిన్న యుద్యోగములను చేసి తరువాత మంత్రులైనవారే.

ఐదుమారులు ఇంగ్లాండుకు ప్రధానమంత్రిగా నుండి గొప్ప యశస్సును సంపాదించి 1898లో దివంగతుడైన గ్లాడ్‌స్టన్‌గారు పార్లమెంటులో పదేండ్లు సభ్యుడుగా నున్న తరువాత తన ముప్పదినాలుగవయేట మంత్రిపదవిని పొందెను. సర్ రాబర్ట్‌పీల్‌గారు పదమూడు సంవత్సరములు పార్లమెంటు సభ్యుడుగానుండి తన ముప్పదియేడవయేట మంత్రిత్వముపొంది తరువాత ప్రధానామాత్యుడయ్యెను. ఆ పదమూడేండ్లలో ఆరేండ్లు చాల చిక్కుల వ్యవహారములుగల ఐరిష్ సెక్రటరీగా అతడు కడు సమర్థతతో పనిచేసియుండెను.

గ్లాడ్‌స్టన్‌కన్న శ్రద్ధాళువైన పార్లమెంటు సభ్యుడు ఆ కాలమున లేడు. ప్రభుత్వ వ్యవహారములనుగూర్చి ప్రభుత్వమువారు ప్రకటించు "బ్లూ బుక్కు"లను నివేదికలనెల్ల అతడు అతి జాగరూకతతో చదువును. ఏ విషయమును గూర్చి కాని చర్చించుటకు నియమింపబడిన పార్లమెంటు కమిటీలలో సతతము శ్రద్ధతో హాజరై పనిచేయును. ఏ విషయముగాని

చర్చింపబడిన పిమ్మట పార్లమెంటుసభ్యులలో ఎంతమంది దాని కనుకూలురో తెలిసికొని పరిష్కరించుటకొరకు అనుకూలు రొక "లాబీ" లేక వరండాలోనికిని ప్రతికూలు రింకొక వరండాలోనికిని వేరువేరుగా విడిపోవుటయు ఆ సమయమున అనుకూలురను ప్రతికూలురను లెక్కించుటయును పార్లమెంటులోని ఆచారము. ఏ విషయమును గూర్చిగాని ప్రజా ప్రతినిధులిట్లు తమ యభిమతమును సూచించుటకే "ఓటు" చేయుట అని అందురు. ఏ విషయముగాని అధికసంఖ్యాక సభ్యులచే ఆమోదింపబడనిది పార్లమెంటువారి అంగీకారము పొందినట్లుగా నెంచబడదు.

ఇటువంటి వోటింగు సమయములలో హాజరై వోటు నిచ్చుట పార్లమెంటు సభ్యులయొక్క ప్రధానమైనకర్తవ్యము. అయితే బాధ్యతగల సభ్యులందఱు నీ సమయములందు హాజరై తమ కర్తవ్యమును నిర్వహింతురు. బాధ్యతలేనివారు పార్లమెంటులో నిట్టి సమయములందు సరిగా నుండరు. గ్లాడ్‌స్టన్ ఇట్టిసమయములలో నెన్నడును హాజరుగాకుండ నుండడు. ఆ కాలమున దేశప్రజలను కలవరపెట్టుచుండిన ముఖ్యసమస్యలనెల్ల గ్లాడ్‌స్టన్ జాగ్రతగా గమనించును. వానిని గూర్చిన సంగతులనెల్ల సేకరించి పార్లమెంటులో తన యభిప్రాయములను వెలిబుచ్చును. అట్టివానిలో వలసరాజ్యములందు బానిసత్వమును రద్దుచేయుటను గూర్చిన సమస్యయొకటి.

ఒక రాజకీయ నాయకుడు మంత్రిపదవిని పొంది, రాజకార్యములను చక్కబెట్టుచు ఒక ప్రభుత్వశాఖను నిర్వహించు

టకు ఆ శాఖకు సంబంధించిన వ్యవహారములన్నియు అతనికి తెలిసియుండవలెనా ? అక్కరలేదా ? అనునది ప్రజాప్రభుత్వ నిర్వాహణమును గూర్చి చాలమంది రాజ్యనీతిజ్ఞులను చిరకాలమునుండి కలవరపెట్టుచున్న ప్రశ్న.

గ్లాడ్‌స్టన్ గారు పదేండ్లపాటు పార్లమెంటులో సభ్యుడుగా నుండి పేరుపొందిన తరువాత మంత్రివర్గమునందు 'బోర్డు ఆఫ్ ట్రేడ్' అను వర్తకశాఖకు ఉపాధ్యక్షుడుగా నుండుటకు అప్పటి ప్రధానమంత్రియైన సర్ రాబర్టుపీల్ గారు అతనిని ఆహ్వానించిరి. ఈ యుద్యోగము దేశీయ దేశాంతర వర్తకమునకు, పరిశ్రమలకు, ఆర్థికవ్యవహారములకును సంబంధించిన మంత్రి పదవి.

గ్లాడ్‌స్టన్ గారు విశ్వవిద్యాలయమున పట్టభద్రుడైన విద్యాధికుడు. చాల తెలివైనవాడు. అయినను ఈ మంత్రి పదవి యతని కొసగబడినప్పుడు, తనకు వర్తకవ్యాపారముల కిటుకులు తెలియవనియు, ఆర్థికశాస్త్రము తెలియదనియు, అందువలన తా నీ యుద్యోగమునకు తగననియు ఆయనకు తోచి తనభయమును పీల్ మంత్రికి చెప్పెను. అప్పుడు పీల్ గారు అట్టి మంత్రిత్వబాధ్యతలను వహించుటకు ఆ మంత్రిత్వ శాఖకు సంబంధించిన వ్యవహారములన్నియు ఆ శాఖను నిర్వహించు మంత్రికి బాగుగా తెలిసియుండ నక్కరలేదనియు, అతని యర్హత, ఆ మంత్రికి గల సహజశక్తిసామర్థ్యాలను బట్టియు, తెలివితేటలనుబట్టియు ఉండుననియు, ఇంతేగాక వర్తకవ్యాపారములను గూర్చియు ఆర్థికవ్యవహారములను గూర్చియు బాగుగా తెలిసియున్న ఉద్యోగు లాశాఖలో

నుండ చేయున్నారనియు, వారి సహాయమును మంత్రి పొంద వచ్చునని చెప్పెను. అంతట గ్లాడ్‌స్టన్‌గారు తన కొసగ పడిన పదవియొక్క భారమును వహించి తన సర్వశక్తులను వినియోగించి వానిని నిర్వహించుటకు తగిన శక్తిసామర్థ్యము లను సంపాదింపవలెననియు, అది తనకు రాజకీయ వ్యవహారము లందు శిక్షణము పొందుటకు నిలైన ఉమ్మెదువారీ యుద్యోగ ముగ నుండి ఉపకరించగలదనియు పలికి ఆ ప్రకారము దాని సామర్థ్యముతో నిర్వహించసాగెను.

గ్లాడ్‌స్టన్ అధిష్ఠించిన పదవియందు దతడు చాల తిక మకలుగల వ్యవహారములను చక్కబెట్టవలసివచ్చుచుండెను. సాధారణముగా చాలఅనుమానము, భయము, అసంతృప్తియు, ఆగ్రహమును గూడ కలిగియుండు వర్తక సంఘ ములవారితో తరచుగా వారికి వ్యతిరేకముగ నుండు చర్చలు కూడ జరుపవలసివచ్చుచుండెను. సామాన్య వర్తకులతోను సరకుల నుత్పత్తి చేయువారితోను, ఎగుమతి దిగు మతులు చేయువారితోను, దళారులతోను, బ్యాంకి వడ్డీ వ్యాపారములు చేయువారితోను, ఇంకను ఇంగ్లాండు దేశపు ఆర్థికవ్యవస్థయందు పడుగు పేకలవలె అల్లుకొనియుండు అనేక ప్రత్యేక వర్గముల వర్తకులతోను, పారిశ్రామికులతోను, అంత ర్జాతీయ వాణిజ్య పరిస్థితులతోను, అందుకు సంబంధించిన న్యాయశాస్త్ర వ్యవహారములతోను ఆయనకు ప్రతిదినము పని కలుగుచుండెను.

ఒకానొక వస్తువుపైన సుంకము విధింపవలసినప్పుడెల్ల తూకమునుబట్టి విధింపవలెనా ? స్వరూపముల సంఖ్యను

(శాస్త్రీలను)బట్టి నిర్ణింపవలెనా? అను ఆలోచన కలుగు చుండును. ఒక ఖనిజముపై పన్ను విధింపవలసివచ్చినచో దానిని కరగించి పోతపోయు కమ్మరులకు తగులకుండగను, ఆ ఆ లోహముతో చేసిన వస్తువులను అమ్ము వర్తకులకు మాత్రము తగులునట్లును, ఒక దినుసుపై పన్ను విధించుటలో పండించు వాని విషయమునను దానిని అమ్మువాని విషయమునను వేరు వేరుగా ఆలోచింపవలసియుండెను. ఓగల బిస్కత్తులపైన పన్ను వేయునప్పుడు ఎంత ఎత్తు గోధుమలు మినహాయించవలెనను నది యొక గడ్డుప్రశ్న. ప్రభుత్వము విధించిన పన్నువలన కాఫ్యూపీపాల వాడకము క్షీణించి ఇనుప డ్రమ్ముల వాడకము అధికమైనదని పీపా చెక్కలను కోయు రంపపుకోత పనివారు మొఱపెట్టుదురు. ఇట్లే ఒక్కొక్క పన్నువలన ఒక్కొక్క వ్యాపారము చేయు వర్తకులకేగాక దానికి సన్నిహిత సంబంధముగల ఇతర వ్యాపారములు చేయు వర్తకులకును వివిధ పారిశ్రామికులకునుగల సాధక బాధకముల నెల్ల ఆలోచింపవలసియుండెను. అట్టి సందర్భములలో నాయా వర్తకులు, వృత్తినంఘములు, పారిశ్రామికులు, మంత్రి దగ్గరకు ప్రాతినిధ్యములనంపి తమ తమ కష్ట నిష్ఠురములను చెప్పుకొనుచుందురు. ఈ ప్రాతినిధ్యములతో వచ్చినవారు, తమ బాధలను సరిగా చెప్పుకొనలేకపోవచ్చును. చెప్పుకొనుటలో మంత్రిగారి కాలమును వృథాపుచ్చవచ్చును. దీనినిగూర్చి విసిగికొనిన లాభము లేదు. గ్లాడ్‌స్టన్ గారు ఎన్న డును విసిగికొనక శ్రద్ధతో వారు చెప్పినవి వినుచుండును. ఇటు వంటి ప్రాతినిధ్యములు తనకు చాల ఉపకరించినవని గ్లాడ్‌స్టన్ గారే చెప్పియున్నారు. ఆయా వ్యాపారములకు వృత్తులకు

సంబంధించిన విషయములను గురించి, అతడు జాగ్రత్తగా ప్రశ్నించి అందలి రహస్యములను, తికమకలను తెలిసికొని వానిలోని ముఖ్యాంశములను జ్ఞాపకార్థము వ్రాసికొనుటవలన, తరువాత పార్లమెంటులో జరుగు చర్చలయందు గ్లాడ్‌స్టన్ తన పన్నుల విధానమును బాగుగా సమర్థించుకొనుటకు వీలు కలిగెను. ప్రతిపక్షులు చెప్పినట్లు దానివలన ఆ యా వృత్తి వ్యాపారములు అడుగంటవనియు, అవి యభివృద్ధి చెందగల వనియు అతడు చూపగలిగెను. ఇందువలన ప్రభుత్వ వ్యవహార నిర్వాహణమునకు ప్రాతినిధ్యము లెంత తోడ్పడగలవో వెల్లడి యయ్యెను.

గ్లాడ్‌స్టన్ శక్తి సామర్థ్యములను, విజ్ఞానమును, వివేచనా శక్తియు అప్పటి ప్రధానామాత్యుడు మఱిమఱి మెచ్చుకొనుచు గ్లాడ్‌స్టన్‌గారి తండ్రికి ఒక జాబును వ్రాసెను. ఈ తెలివితేటల తోనే గ్లాడ్‌స్టన్ తరువాత ప్రధానమంత్రిగా వ్యవహరించి ఓహో యనిపించుకొనెను.

"కామన్సు సభలో ప్రవేశించిన వారికది క్రమశిక్షణము నొసగు పాఠశాల యని చెప్పవచ్చును. అది అత్యంత శక్తి సామర్థ్యములు గల పాఠశాలయని నా యభిప్రాయము. అది శక్తి సామర్థ్యములు, తెలివితేటలు, చురుకుదనమునిచ్చు మహోన్నత విద్యాలయము; అది నీతి ధర్మములను నేర్పు గొప్ప విద్యాలయముకూడ; గౌరవ మర్యాదలను బోధించు బడి, అది న్యాయధర్మములను స్థాపించు విజ్ఞాన మందిరమూ

అని గ్లాడ్‌స్టన్ మంత్రి 1878లో చెప్పియున్నాడు. ఆయన 1894
లో నిట్లు చెప్పినాడు:- "రాజకీయ జీవనము నొక వృత్తిగా
నెంచినచో మానవుని నైతిక జీవనమునకు కొంత భంగము
కలిగించును. కాని అందులో కొన్ని సుగుణము లున్నవి.
మొట్టమొదట నాకు తోచునది; కామన్సు సభకన్న కొంత
మును నేర్పు పాఠశాల మరియొకటి లేదను సంగతియె. కొంత
పథమునుండి ఏమాత్రము తొలగినను అది యా సభలోని ప్రతి
సభ్యునిపట్లను తప్పు గావించినట్లగును. ప్రతిసభ్యుని కిది గాయము
కలిగించి నొప్పించినట్లగును. తత్క్షణమే ఆ నేరముచేసిన సభ్యు
నికి శాస్తి జరుగును. సభలో చర్చింపబడు విషయములు చాల
జాగ్రత్తగా మనస్సునెల్ల లగ్నముచేసి ఆలోచించవలసిన
అత్యంతావసరములైన అంశములై యుండును. అందువలన
అది ఒక్కొక్క సభ్యునియొక్క సర్వశక్తులను వినియోగించ
వలసినవిగా నుండును. అతని కా సమయమున నింకొక ధ్యాస
యుండుటకు వీలు లేదు. అతడు తననుగూర్చి ఆలోచించుటకు
గూడ వీలులేదు. నీటిలో నీదువాడు తన ప్రాణములను కాపా
డుకొనుటకు ఈదుచున్నప్పటివలె, పార్లమెంటు సభ్యుడు
ఉండును. అప్పుడు చర్చించుచున్న విషయములతో పోల్చి
చూచుకొనినచో తానెంత అల్పజ్ఞుడో తెలియగలదు. ఒక
వ్యవహారము కేవలము చర్చించుటతో మాత్రమే అంతము
నొందక అది యొక కార్య నిర్వహణమున పరిణమించినచో
మరింత బాగుండును. అది శాసన నిర్మాణ వ్యవహారమైనను,
పరిపాలన వ్యవహారమైనను ఫలితములనుబట్టి చర్చల స్వార
స్యము పరీక్షించుటకు వీలగును. అట్టి స్థితిలో కేవలము ఆకాశ

పథము నంటు ఆలోచనలతోను, గొప్ప గొప్ప కోరికలతోను, ఉవ్విళ్లూరుచు కూర్చుండు వాక్ఛూరత్వ పద్ధతి పోవును. అతడు తన పొరపాటులను గ్రహింప వీలుకలుగును. నిర్వహించుటకు వీలైన పథకములనే వేసికొను పద్ధతి అలవాటు అగును. ఏ రాజకీయవేత్తయు గర్విష్ఠిగా నుండుటకు వీలు లేదు."

10]

# పార్లమెంటు సభ్యుల బాధ్యతలు

ప్రజలవలన ప్రజలకొఱకు నిర్వహింపబడు రాజ్యాంగ పద్ధతికే ప్రజాప్రభుత్వమని పేరు. దేశములోని ప్రజలందఱును కలిసి ఒక సభగా నేర్పడి కార్యాలోచనము చేయుచు పరిపాలనము చేసికొనుట సరియైన ప్రజాప్రభుత్వ పద్ధతి కాని విశాలమైన దేశమున బహుసంఖ్యాక జనులున్నచోట నిది సాధ్యము కాదు గనుక ప్రజలు తమ కిష్టమైనవారిని కొందఱిని తమ ప్రతినిధులుగా నెన్నుకొనగా వారొక సభగా సమావేశమగుచు కార్యాలోచనమును కార్యనిర్వహణమును చేయుదురు. కార్యాలోచనము చేయు ప్రజాసభను శాసనసభయని, పార్లమెంటు అని పిలుతురు. కార్యనిర్వహణము చేయువారిని మంత్రివర్గమందురు.

ఇంగ్లాండు స్వరూపమున రాజరికముగా కనబడుచున్నను రాజ్యాంగస్వభావమునుబట్టి యిది ప్రజాప్రభుత్వముగ నున్నది. ప్రభుత్వ వ్యవహారములన్నియు రాజుపేరిటనే జరుగుచున్నను నిజముగ దేశపరిపాలనము చేయువారు ప్రజాప్రతినిధుల విశ్వాసమునకు పాత్రులగు మంత్రివర్గమువారే. ఇంగ్లాండుదేశపు ప్రజాప్రతినిధులు ప్రభువుల సభ, కామన్సు సభ అను రెండు సభలలో సమావేశమగుచుందురు. ప్రభువుల సభలో వంశపారంపర్యముగా భూస్వాములైన ధనవంతులును మతాచార్యులును రాజగారివలన ప్రభువు బిరుదము నందిన వారు నుందురు. కామన్సు సభలో వివిధప్రాంతములందు దేశ ప్రజలు ఎన్నుకొనిన ప్రజాప్రతినిధులు ఐదుసంవత్సరములవరకు

గాని, ఈలోపున మరల ఎన్నిక జరుగువరకుగాని సభ్యులుగా నుందురు.

ఇంగ్లాండు దేశములోని రాజ్యాంగధర్మమునుబట్టి ప్రభుత్వాధికారములన్నియు రాజు, ప్రభువులసభ, కామన్సుసభ కలిసిన 'పార్లమెంటు' అనబడు రాజ్యాంగ సంస్థయందే నెలకొనియున్నవి. జనసామాన్యముయొక్క విశ్వాసమును గోల్పోయిన ప్రజాప్రతినిధులుగాని, మంత్రులుగాని ఒక్క క్షణమైనను పార్లమెంటులో నుండుటకు వీలులేదు. అందువలన నక్కడ ప్రజాప్రభుత్వము సార్థకమై వెలయుచున్నది. ఇంగ్లండులోని పార్లమెంటరీ ప్రజాప్రభుత్వ విధానములోని రాజ్యాంగ మర్యాదలు ప్రపంచములో ప్రజాప్రభుత్వమును చక్కగా నిర్వహించుకొన జూచువా రందరికిని ఆదర్శప్రాయములుగా నున్నవి. మనము భారతదేశమునకూడ ప్రజాప్రభుత్వమే స్థాపించుకొనియున్నాము గనుక ఈ రాజ్యాంగ మర్యాదలను చక్కగా గ్రహించుట అవసరము.

ఇంగ్లాండు పార్లమెంటరీ ప్రజా ప్రభుత్వమునందు ప్రజాప్రతినిధుల శాసనసభయైన కామన్సుసభకు ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధుల బాధ్యతలెట్టివి ? దేశములో వివిధ ప్రాంతములందలి ప్రజలు ఈ సభ్యుల నెన్నుకొందురుకదా, అట్లెన్నుకొను నియోజకవర్గములపట్ల ఆయా సభ్యులకుగల ప్రత్యేకబాధ్యత లెట్టివి ? పార్లమెంటు కెన్నుకొనబడిన సభ్యులు తమ యుద్యోగమునుబట్టి నిర్వర్తించవలసిన కార్యము లెట్టివి ? ఆ సభ్యులు తమ నిత్యజీవనము నెట్లు గడపవలసి

యున్నారు ? అనునవి మనము జాగ్రత్తగా గమనింపదగిన యంశములుగా నున్నవి.

ఇంగ్లాండు దేశములో 1774 వ సంవత్సరము నవంబరు నెలలో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలో బ్రిస్టల్ నగరమువారు కామన్సుసభకు రెండుస్థానములకు ఇరువురు సభ్యుల నెన్నుకొన వలసియుండిరి. అందులో నొక స్థానమునకు, స్వాతంత్ర్యప్రియుడును, మహావక్తయునైన ఎడ్మండు బర్కు మహాశయు డభ్యర్థియై నిలిచెను. ఇతడా పట్టణమునకు క్రొత్తవాడు. రెండవ స్థానమునకు నిలిచినవాడు మాత్రమా పట్టణమునకు ప్రాతకాపును ఆ పట్టణవాసుల యాజ్ఞానువర్తిగా నుండు వాడునై యుండెను. బర్కు మహాశయుడు ఎన్నికలో జయము గాంచి పార్లమెంటు సభ్యుడైనాడు. అంతట పార్లమెంటు ప్రజా ప్రతినిధిగా తనకుగల బాధ్యతలను గూర్చి అత డొక మహోప న్యాసమును గావించినాడు. నాటికిని, నేటికిని అది పార్లమెంటు సభ్యులయొక్క బాధ్యతలను గూర్చిన ఒక ప్రమాణసూత్ర ముగా పరిగణింపబడుచున్నది. అత డిట్లనెను.

"మహాశయులారా ! ప్రజాప్రతినిధి, పార్లమెంటు సభ్యుడు, తన నెన్నుకొనిన నియోజకవర్గముతో అవినాభావ సంబంధము కలిగియుండవలెనను సంగతి నిజము. అతడట్టి అర మరయులేక తన హృదయమిచ్చి ప్రవర్తింపనలెను. వారితో అతి తరచుగా ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచు అత్యంత సన్నిహితుడుగా నుండవలెను. వారి కోర్కెల నతడు మన్నింప వలయును. వారి అభిప్రాయముల నతడు గమనింపవలయును. వారి వ్యవహారములపట్ల అతడు శ్రద్ధవహింపవలయును, వారి

నిమిత్తము అతడు తన విశ్రాంతిని, కాలమును, తన సంతోష మును సౌఖ్యమునుగూడ త్యజింపవలయును. మఱియు ముఖ్య ముగా తన క్షేమలాభములకన్న వారి క్షేమలాభములనే ఎక్కువ శ్రద్ధగా చూడవలెను. కాని నిష్పక్షపాతమైన తన స్వంత అభిప్రాయములను, పరిపక్వమైన తన వివేచన జ్ఞాన మును, తన అంతరాత్మకు న్యాయమని తోచిన ధర్మమును మాత్రము, అతడు విడనాడరాదు. ఇవి నియోజకుల ఇష్టానిష్ట ములనుబట్టి అతనికి లభించినట్టివిగాని, రాజ్యాంగ విధులనుబట్టి సిద్ధించినవిగాని కావు. అవి పరమాత్మ యనుగ్రహమున నత నికి లభించిన ధర్మములు. వాని నతడు దుర్వినియోగము జేసి నచో ఆ పాపము నతడనుభవింపవలసియుండును. మీ ప్రతి నిధి తన యావచ్ఛక్తిని మీ కొఱకు వినియోగింపవలసి యుండును. తన బుద్ధిబలమునెల్ల మీ కొఱకే వినియోగింప వలసియుండును. మీ మోమాటము కొరకు దాని నతడు ఉపయోగింపనిచో స్వామిసేవ చేయుటకు బదులు స్వామి ద్రోహము చేసినవాడగును.

"నాతోడి సభ్యుడు, మీకు చెప్పినట్లు విని, మీకు లోబడియుండు ననుచున్నాడు. ఇది వెఱ్ఱిబాగులమాట. ప్రభుత్వనిర్వహణమనునది కేవలము ఒకరి ఇష్టముపైన నాధార పడినదే యైనచో, నా యిష్టముకన్న మీ యిష్టమే ఎక్కు డుగా గణింపదగినది. అయితే ప్రభుత్వనిర్వహణము, శాసన నిర్మాణము అనునవి ఆలోచన వివేచనలతో (Reason and-Judgment) నిర్వహింపవలసిన కార్యములుగాని, కేవలము ఇష్టానిష్టములనుబట్టి జరుపు సామాన్యకార్యములు కావు.

"ఒక విషయమునుగూర్చి ఆలోచించి చర్చించుటకు పూర్వమే, దానినిగూర్చి ఒక నిర్ణయమును చేసివేయునట్టిది ఆలోచన మెట్లగును? ఆలోచించువారు కొందరును, నిర్ణయించువారు మరికొందరున్నచో అదియెట్లు సరిగా జరుగును? ఒక విషయముయొక్క మంచి చెడుగులను వినువారికి మూడువేలమైళ్ళ దూరములో నున్నవారు దానినిగూర్చి నిర్ణయించివేసి యున్నచో కార్యనిర్వహణ మెట్లు కొనసాగును?

"తమ అభిప్రాయము మీదో చెప్పుటకు అందరికి అధికారమున్నది. తన నెన్నుకొనిన నియోజకుల అభిప్రాయము వారి ప్రతినిధి సంతోషముతో విని జాగ్రత్తగా ఆలోచింపతగిన గొప్ప యభిప్రాయమే. అయితే ఈ పరికారము చేయుడు, ఆ ప్రకారముగ జేయుడూ, అని యాజ్ఞాపన పూర్వకముగా వారేదైన సూచనలను జేసినచో మాత్రము అది అతని బుద్ధికి, అంతరాత్మకు విరుద్ధమని తోచినప్పటికిని అతడు దానిని శిరసావహించి తు. చ. తప్పకుండ వారి ఆజ్ఞానుసారముగా నాచరించి వోటుచేసి వారి యిష్టానుసారముగ ప్రవర్తింపవలసి యుండుననుట మాత్రము సరికాదు. ఇది దేశముయొక్క న్యాయధర్మములకు విరుద్ధము. ఇది మన రాజ్యాంగధర్మములకు గూడ అనుగుణమైన అభిప్రాయము కాదు. పార్లమెంటు అనునది పరస్పర విరోధకలములైన వేరువేరు ప్రత్యేకవర్గముల వారంపిన రాయబారుల సభ కాదు. ఒక్కొక్క ప్రతినిధి తనను బంపినవారి క్షేమలాభములను మాత్రమే గమనించి తక్కినవారంపిన ప్రతినిధులను ప్రతిఘటించి, వారి కెదురుగా

వాదించి ప్రవర్తించుట కేర్పడిన సభ కాదు. పార్లమెంటుసభ అనునది, ఒక జాతియొక్క కార్యాలోచనసభ. సర్వేజనా స్సుఖినో భవంతు అను ఆర్యోక్తిని మనస్సులో నుంచుకొని జాతియంతటి యొక్క క్షేమలాభములను సర్వతోముఖముగా కనిపెట్టి చరింపవలసిన కార్యాలోచనసభ ఇది. కేవలము ఒక ప్రాంతమునకు, ఒక వర్గమునకు సంబంధించిన క్షేమలాభములు గాని వారి వారి చిల్లర తగవులుగాని, అభిప్రాయభేదములు గాని వారు పాటింపరాదు. సర్వజన శ్రేయమును గూర్చిన సమాలోచనము పైననే వారు నిర్ణయము లాధారపడవల యును. మీ రొక సభ్యుని ఎన్నుకొందురనుమాట నిజమే కాని మీ రాతని నెన్నుకొని నంతటనే అతడు కేవలము మీ బ్రిస్టల్ పట్టణ సభ్యుడు గాక పార్లమెంటు సభ్యుడగును."

ఈ యుపన్యాసభాగము చాల ప్రసిద్ధి కెక్కినది. బర్కుమహా శయుడు చెప్పిన రాజ్యాంగ సిద్ధాంతములు క్రొత్తవి కావు. ఇదివరకు బ్లాక్‌స్టోన్ మొదలైన రాజ్యనీతిజ్ఞులు చెప్పినవే. కాని యింత చక్కగా యింత బాహాటంగా, యింత స్పష్ట ముగా, యింత గట్టిగా ఎవ్వరును చెప్పియుండలేదు. ఈ మాటలు చెప్పిననాటినుండి నేటికి రెండువందలేండ్లు గడచినను, నియోజకవర్గములందును, పార్లమెంటు సభ్యుల కర్తవ్యము లందును, పెక్కుమార్పులు వచ్చినను, ఈ సిద్ధాంతము లిప్పటి కిని అందరును అంగీకరింప తగినట్టివిగనే యున్నవి. ఒక స్థానిక నియోజకవర్గ మొక పార్లమెంటు సభ్యుని ఎన్నుకొనును. ఆ నియోజకవర్గము విషయములో నతనికి కొన్ని ప్రత్యేకబాధ్యత లుండును. అయితే అతడు కేవలము వారు చెప్పినట్లెల్ల చేయ

వలసిన కార్యనిర్వాహక ప్రతినిధిమాత్రము కాదు. మొత్తము మీద యావత్తు దేశముయొక్క క్షేమ లాభములకును బాధ్యత వహించు ఒక గొప్ప రాజ్యాంగసంస్థయం దతడు సభ్యుడుగ నుండును. తన నెన్నుకొనిన నియోజకవర్గమువారి కోర్కెలను బట్టియు, అభిప్రాయములనుబట్టియు అతని రాజకీయపక్షము యొక్క నిర్ణయములనుబట్టియు, అతనిలో కొంత చలనము కలుగుచున్నప్పటికిని, పార్లమెంటులో చర్చించి నిర్ణయింపబడు విషయములందు తన స్వబుద్ధిని ఉపయోగించు హక్కును మాత్ర మతడు విడనాడడు.

ఏదో ఒక స్థానిక సమస్యనుగాని, ఒక స్థానిక వర్గము యొక్క క్షేమలాభములు గాని గాక, దేశమంతటికి సంబంధించి, దేశము నెల్ల కలవరపెట్టు సమస్యలనే ప్రధానముగా నెంచి ఎన్నికలు జరుపుట ఇంగ్లాండులో ప్రస్తుతము ఆచారముగా నున్నది. సాధారణముగా ప్రస్తుతము రాజ్యపరిపాలనమును చేయుచున్న ప్రభుత్వవర్గము వారికి అనుకూలుడుగగాని, ప్రతికూలుడుగగాని ఒక అభ్యర్థి ఎన్నికలలో పోటీచేయును. అతడు పార్లమెంటులోనున్న రాజకీయపక్షముల వారిలో నేదో యొక పక్షమున చేరి, వారి రాజకీయ దృక్పథముననే అతడును సాధారణముగా అవలంబించెదనని వాగ్దానము చేయుచుండును. మితపానము, వ్యాపారవృత్తి కట్టుడి సంఘములు (Trade Unions) స్త్రీల ప్రాతినిధ్యము మొదలైన కొన్ని విషయములను గూర్చి ఇట్లిట్లు ప్రవర్తింతునని కొన్ని కొన్ని వాగ్దానములను అతడు చేయవలసివచ్చు, అతడు పార్లమెంటు సభ కెన్నుకొనబడగనే ఆ వాగ్దానములకు సాధ్యమైనంత అనుగుణముగా నతడు ప్రవర్తింపవలసియున్నను, అతని నెన్నుకొనిన నియోజక

వర్గ ప్రాంతమునందలి యధిక సంఖ్యాక సమ్మతులను సంపాదించిన రాజకీయపక్షముయొక్క సభ్యుడుగానే అతడు ప్రవర్తించును. దాని నాయకులపట్ల భయభక్తులు కలిగి ప్రవర్తించును. ఏ విధముగా నాలోచించినను అతడు కేవలము కొందరు నియోజకు లధికారములిచ్చి పంపిన ప్రతినిధి కాడు. అతని అధికారములు పరిమితములు కావు. అతని అధికారములను నియోజకవర్గమువారు తీసివేయుటకు వీలు లేదు. పార్లమెంటుకు ఎన్నికొనబడిన పిదప అతడు తన రాజకీయపక్షముతోడి సంబంధమును వదలుకొని మరియొక పక్షమును జేరదలచినను చేరవచ్చును. అంతమాత్రమున తన సభ్యత్వమును మానుకొనవలసినదని అతనిని కోరుటకు వీలు లేదు. ఇంగ్లాండు దేశమునందలి రాజకీయ పక్షములమధ్య దాటుటకు శక్యముగాని అగాధమైన సిద్ధాంతభేదములు లేవు. దేశ క్షేమలాభములకు సంబంధించిన ముఖ్యవిషయములందెల్ల అన్ని పక్షములవారు నొకే అభిప్రాయమును కలిగి ఒకే నీతిధర్మములకు కట్టుపడి ప్రవర్తింతురు. తక్కిన యంశమునందు మాత్రము కొన్ని కొన్ని భేదాభిప్రాయములు కలిగియుందురు. ఆ దేశములోని రాజకీయ పక్షములవారికి కార్యాలోచనమునందు, కార్యాచరణమునందు కొన్ని భేదములుండును. అందువలన వారి వారి పరస్పర ప్రణాళికలందలి వివిధ విషయముల నెల్ల తూచి చూచుకొనుటతో ఒకొక్క యొకొక్క పక్షమువారి దృక్పథమును వరించి అందు సభ్యుడగును. దేశకాల పరిస్థితులందు కలిగిన మార్పులవలనగాని, అతని అభిప్రాయములందే కలిగిన మార్పులవలనగాని అతడు మరల ఆలోచించుకొని, తాను

మొదట చేరిన పక్షమును వీడి, ఇంకొక పక్షమున చేరవచ్చును. అంతమాత్రమున నతనిని నిందింపవీలు లేదు. సాధారణముగా నెవ్వడును సులభముగా తన సిద్ధాంతములను మార్చుకొనడు. ఎంతో బలవత్తరమైన కారణమున్నగాని తన రాజకీయ పక్షమునుండి తొలగి ఇంకొక పక్షమున చేరడు. అందువలన, మనస్సులో బాధ పడిపడి, తుదకతడు తన పక్షముతో కలిసి పని చేయలేక అన్యపక్షమున చేరుటకు తెగించిన అతని సాహసమునకు మెచ్చుకొనవలసినదే. ఇటువంటి సమయమున మొదట తాను అభ్యర్థిగా నిలిచినప్పుడు చేసిన వాగ్దానముల కిది ఎంతవరకు వ్యతిరేకమగునని యోచించుకొనవలసి యుండును. పార్లమెంటులో నింకొక పక్షమువారితో నతడు చేరదలచిన సమయమున నొక్కొక్కప్పుడతడు తన సభ్యత్వమునకు రాజీనామ నిచ్చి మరల తన స్థానమునకు జరుగు ఎన్నికలలో అభ్యర్థిగా నిలుచును. అప్పుడతని అభిప్రాయములను, తన నిశ్చయమును అతని నియోజకులు ఆమోదించినచో అతనినే మరల నెన్నుకొందురు. అయితే అతడు తన స్థానమునకు రాజీనామా నివ్వవలయునను నియమము లేదు. అది కేవలము అతని యిష్టముపైననే ఆధారపడియుండును. తాను చేసినది యుక్తమా? అయుక్తమా? అని అనుమానము కలిగిన పక్షమువనే అతడట్లు చేయును.

పార్లమెంటులోని రాజకీయపక్షముల కట్టుబాటు ఇటీవల హెచ్చు అయినదని లోవెల్ అను రాజనీతిజ్ఞుడు చెప్పియున్నాడు. అయితే ఇతరులు చెప్పినంతటి రాజకీయపక్ష నిర్బంధములుగాని, ప్రభుత్వపక్షమువారి నిరంకుశత్వముగాని పార్ల

మెంటు సభ్యులను బాధించుచున్నవని చెప్పుటకు వీలు లేదు. పార్లమెంటు సభ్యుడు కేవల మొక కీలుబొమ్మ కాడు. అతడు నొక మానవుడే. పార్లమెంటు సభకు బయటనుండు వ్యక్తుల వలెనే అతనికిని అనేక ఆలోచనలు కలుగుచు అతని మనస్సును కలతపెట్టుచుండును.

మానవజీవితమునందలి ఇతరవిషయములందు వలెనే రాజకీయములందుకూడ 'పదుగురాడు మాట పాటియై చెల్లుచుండు' నని, అందువలన సంఘీభావమును సంఘబలమును జేకూర్చుకొనుట అవసరములని అతడెరుగును. అందువలన అనేక విషయములం దతడు తన సొంత అభిప్రాయముల నణచుకొని, తన రాజకీయపక్ష నాయకుల అభిప్రాయమును శిరసావహించును. కట్టుబాటులుగల ఒక రాజకీయ పక్షమున ఒక రాజకీయ వ్యవస్థయందు పలుకుబడిగల ఒక సభ్యుడుగా నుండదలచినచో క్రమశిక్షణకు లోబడియుండుట అత్యంతావశ్యకమని అతడెరుగును. ఒక రాజకీయ పక్షమును ఒక త్రాటిపై నడిపించుటకు ఎంతటి సహనము, ఎంతటి సామదాన భేదోపాయముల ప్రయోగింపవలయునో ఆ రాజకీయపక్షమును నడుపు నాయకులకేగాని, ఇతరులకు తెలియదు. రాజకీయపక్షము యొక్క సభ్యత్వపు కట్టుబాటుల నతికఠినముగ జేసి, వ్యక్తి స్వాతంత్ర్యమును పూర్తిగా అణచినచో ఒక్కొక్కప్పుడా మర్యాద మితిమీరి, ఆ పక్షముయొక్క విచ్ఛిత్తికి దారి తీయును. అందువలన ఆ కట్టుబాటులలో కూడ కుడి యెడమ యుండును. వ్యక్తులలో అభిప్రాయ భేదములకు కొంత అవకాశముండును. అందువలన అనేక విషయములలో రాజకీయ

పక్షములోని వ్యక్తుల యభిప్రాయభేదములకు ఆ పక్షముల అభిప్రాయభేదములకును చాల తారతమ్యము లుండును. మఱియు రాజకీయ పక్షముల నాయకులను, ఆ పక్షీయులను గూడ పార్లమెంటుకు కెలుపలగల ప్రజానీకముయొక్క అభిప్రాయములను గమనింపకుండ నుండజాలరు. అందువలన పార్లమెంటులోని వివిధ పక్షముల నాయకులను అనుయాయులను గూడ దేశ ప్రజల భావసంచలనములను, అభిప్రాయములందు కలుగుచున్న మార్పులను జాగ్రత్తగా కనిపెట్టి చూచుచు, తమ చర్యల నెల్ల అందు కనుగుణముగా నుండునట్లు ప్రవర్తించు చుందురు. దేశములోని వివిధ విషయములను గూర్చిన ప్రజాభిప్రాయమును తెలిసికొనుటకు ప్రధానసాధనములుగా నున్న వార్తాపత్రికలనుబట్టి ప్రజల చిత్తవృత్తులను, భావములను, ఇష్టానిష్టములను తూచిచూచుట చాల కష్టసాధ్యమును, పెక్కు పొరబాటులకు కారణమును అగుచుండును.

నిరంకుశపరిపాలనము, అనియంత్రిత ప్రభుత్వమును, క్రమశిక్షణము పేరున కఠిన నియమములును, పార్లమెంటు సభ్యుని కర్తవ్యనిర్వహణమునకు విరుద్ధములైన విషయములు. దేశకాల పాత్రములను బట్టి, వివిధపరిస్థితులనుబట్టి యేర్పడు వివిధసందర్భములలో ఒక్కొక్కప్పుడు పరస్పర విరుద్ధములును, వేరువేరు మార్గములకు లాగునట్టివియునైన ప్రేరకశక్తులకును ప్రభావములకును లోనై ప్రవర్తింపవలసియుండును. పార్లమెంటు 'లాబీ'లలో పొగబీల్చుట కేర్పడిన విశ్రాంతిమందిరములలో, డాబాపైన భోజనఫలహార సమయములలో, తన పక్షమునకు జెందిన సభ్యులతోనే గాక ప్రతిపక్షము

నకు చెందిన సభ్యులతో సంభాషణలు సరస సల్లాపములు చేయుచు అన్యోన్యముగ కాలము గడుపుచుండుటవలన ఇతరుల రాజకీయ అభిప్రాయములలోని మంచి చెడుగులను తెలిసికొనుటకు అవకాశము ఏర్పడి అందువలన తన అభిప్రాయములందును, చర్యలందును కొంత మార్పు కలుగుటకును అవకాశము ఏర్పడుచుండును. రాజకీయపక్షములో సభ్యుల నెల్ల కూడగట్టుకొని, ఒక్కొక్క తీర్మానముపైన వారందరు నేకగ్రీవముగా, 'ఓటు' చేసి తమ పక్షమునకు బలమును చేకూర్చుటకు నియమింపబడిన "విప్పు" లనబడు పార్టీ యుద్యోగులు పిలిచినప్పుడెల్ల మారుమాటాడక వెంటనే వచ్చి సరిగా వోటుచేయు సభ్యులు వారి దృష్టిలో చాలమంచివారు. అట్లు చేయక, కొంత జాగుచేసినను, తప్పించుకొన్నను, ఇతడు చెప్పిన మాట విన"డని, మిక్కిలి స్వతంత్రుడని, వారు నిందింపవచ్చును. ఒక్కొక సభ్యుడు, పార్లమెంటు చర్చలందు తరచుగా మాటలాడుట కలదు. ఒక్కొకడు మాటలాడకుండగనే వోటు చేయుచుండును. తన స్వతంత్రబుద్ధిని వివేచనను ఉపయోగించి తన పక్షములకు సలహా నిచ్చుచుండును. ఏమైననేమి, . పార్లమెంటులోని సభ్యుడు కేవలము స్తబ్ధుడుగా నుండడు. పార్లమెంటు సభలోపల వివిధరాజకీయపక్షములకు చెందిన సభ్యులందును, బయటగల ప్రజానీకమునందును అనేక కారణముల వలన అనుక్షణమును మార్పుచెందు వివిధములైన పరిస్థితులను జాగ్రత్తగా గమనించుచు, దానికి బాధ్యతవహించి ప్రవర్తించు ఒక ప్రజాసంస్థలో నొక సభ్యుడైనందువలన

పార్లమెంటు సభ్యుడు కేవలము ఒక యంత్రమువలె ప్రవర్తించుటకు వీలుపడదు.

పార్లమెంటు సమావేశమైయుండు సమయములందు పార్లమెంటు సభ్యుడు హెచ్చుకాలము తనతోడి సభ్యులతో గడుపవలసియుండును. అయితే, అతడు పార్లమెంటు సభ్యుడేగాక ఒక ప్రత్యేక నియోజకవర్గముయొక్క ప్రజాప్రతినిధికూడ, ఆ నియోజకవర్గమువారిలో అతనిపక్షమున వోటు చేసినవారును, చేయనివారును కూడా ఉన్నను, అతడు సభ్యుడైన తరువాత ఆ నియోజకవర్గమువారందరకును ప్రతినిధిగానే అతడు ప్రవర్తింపవలెను. పార్లమెంటు సమావేశము జరుగుచున్న కాలములోను, జరుగని కాలములోను వెస్టుమినిస్టరులో పార్లమెంటు సభాభవనములోపలను, దాని వెలుపలనుగూడ ఈ సభ్యుడు, తన నియోజకవర్గముతో అత్యంత సన్నిహిత సంబంధమును కలిగియుండి, దానిని సరిగా గమనించుచుండవలయును. అతడా నియోజకవర్గమున్న ప్రాంతములో నొక ధనవంతుడై యుండవచ్చును ఒక గొప్పవంశమునకు చెందినవాడై యుండవచ్చును. లేదా చాలమంది కూలిజనమునకు జీవనము కల్పించు పారిశ్రామికసంస్థకు యజమానుడై యుండవచ్చును. అతడా ప్రాంతమునందు స్థానికస్వపరిపాలన సంస్థలను చక్కగా నిర్వహించినవాడై యుండవచ్చును. అక్కడ నేదో యొక పారిశ్రామికసంఘమునకు కార్యదర్శియై వారి ప్రేమకు, గౌరవమునకు పాత్రుడై యుండవచ్చును. లేదా తన స్నేహితులయొక్క వాత్సల్యమువలన ఎన్నికలలో విజయమును పొందియుండవచ్చును. అటుగానిచో కొన్ని నెలలుగాని, సంవత్సరములుగాని

నియోజకవర్గమువారి నాశ్రయించి ఏదో విధముగా పైకి వచ్చి యుండవచ్చును. ఏవిధముగా పార్లమెంటు కెన్నికొనబడినను, అతడు సభ్యుడుకాగానే అతడు తన నియోజకవర్గమువారి పట్ల జరుపవలసిన కర్తవ్యములు చాల హెచ్చుగను, శ్రమను కలిగించునట్టిగను ఉన్నవను సంగతి నతడు త్వరలోనే గ్రహించును. కేవలము ఉత్తర ప్రత్యుత్తరములే అతనికి చాల వ్యయప్రయాసలు కలిగించుచుండును. పూర్వకాలమున ఏ పురపాలకసంఘమువారో పంపిన సభ్యుడు వారమున కొకతూరి తన నియోజకవర్గములోని కొద్దిమంది మిత్రుల కొక జాబు వ్రాసినచో తన బాధ్యత నిర్వర్తించుకొనినట్లే ఎంచుకొనుచుండును. ఆధునిక నియోజకవర్గములు చాలమంది వోటరులతో నిండిన ప్రాంతములుగ నుండును. వారు తమ ప్రతినిధులకు అతి తరచుగా జాబులు వ్రాయుదురు. ప్రత్యుత్తరముల కొరకుఎదురుచూచుచుందురు.ఆధునికకాలములోనిపార్లమెంటు సభ్యుడు ప్రతిదినము ఉదయమున నింటిదగ్గర నున్నప్పుడును, మధ్యాహ్నము కామన్సుసభలోని గ్రంథాలయ మందిరమునను లాబీలలోనుకూడా జాబులు వ్రాయుచుండును. అతడు తన నిజయోకవర్గ స్థానమునకు సంబంధించిన ప్రశ్నలను కొన్నిటిని పార్లమెంటులో నడిగి, వానికి మంత్రు లిచ్చు జవాబులను తపాలాద్వారమున తన నియోజకులకు తెలిపి, దానిని గూర్చి తన అభిప్రాయములను గూడ వెల్లడించవలసియుండును. నియోజకవర్గములకు సంబంధించిన ప్రయివేటు బిల్లు చట్టములైనపైన పార్లమెంటు కమిటీలలో చర్చకు వచ్చునప్పుడా నియోజకవర్గమువా రెన్నుకొనిన సభ్యుడా కమిటీలలో పని చేయరా

దను నియమ మొకటి ఇప్పుడు పార్లమెంటు సభలో అమలు జరుగుచున్నది. అయినను, కామన్సు సభలో నది బహిరంగముగా చర్చకు వచ్చినప్పుడు మాత్రము దానివలన తని నియోజక వర్గమునకు కలుగగల లాభనష్టములను గూర్చి ఆ సభ్యుడు చెప్పిన దాని కనుకూలముగా గాని, వ్యతిరేకముగా గాని వాదింపవచ్చును. అట్లు చర్చింపబడునది ప్రయివేటుబిల్లు (చిత్తు చట్టము) గాక శాసన విధులను మార్చు పబ్లికు చిత్తు చట్టమే యైనచో అది తన నియోజకవర్గమునకుగాని, అందులోని ఒక ముఖ్యమైన వర్గమునకుగాని, ఎట్టి నష్టము కలిగింపగలదో దానిని గూర్చి చెప్పవచ్చును. ఈ విషయమై తన నియోజక వర్గమువారతనికి చేయు విన్నపముల నతడు జాగ్రత్తగా విని ఆలోచింపవలెను. కేవలము తపాలాద్వారముననే గాక 'డెప్యుటేషను' లనబడు ప్రాతినిధ్యములతో కలిసి మాట్లాడుట ద్వారమునను, సభలను సమావేశము చేయుట మూలమునను గూడ అట్టి విన్నపముల తనికి నివేదింపబడుచుండును. సాధారణముగా నట్టి ప్రాతినిధ్యములకును, సమావేశములకు మంత్రులే ఎక్కుడు కాలమును వినియోగింప వలసియున్నను, సామాన్య సభ్యులుకూడా పార్లమెంటు సమావేశమగు కాలములో ఇందు నిమిత్తము కొంతకాలము వినియోగింపవలసియుందురు. ఇట్టి సందర్భములలో తనను చూడవచ్చినవారి కతడు దర్శన మిచ్చుటయే గాక తానుకూడ వారి ప్రాతినిధ్యముతో కలిసి వెళ్ళి మంత్రులను దర్శించి తన నియోజకవర్గము వారి కోర్కెలను అభిప్రాయములను దేశప్రభుత్వమునకును శాసన నిర్మాణమునకును బాధ్యులైన మంత్రులకు తెలియపరచుచుండవలెను.

కేవలము శాసన నిర్మాణమునకును, పరిపాలనమున కును సంబంధించిన విషయములలో తన నియోజకులకు సహాయము చేయుటలో మాత్రమే మన పార్లమెంటు సభ్యుని బాధ్యత పూర్తి కాదు. పార్లమెంటు సమావేశము జరుగుచున్న సమయములో ముఖ్యమైన చర్చలు జరుగునప్పుడెల్ల సభామందిరంలో ప్రేక్షకులు కూర్చుండు గ్యాలరీలకు ప్రవేశమును కలిగింపవలసినదని అనేక లతనిని బాధించుచుందురు. రాజకీయముగా మాత్రమే తనకు అల్పపరిచయముగల స్త్రీ పురుషుల ననేకుల నతడు పార్లమెంటు భవనముయొక్క వసారాలలో వెంటబెట్టుకొని తీసికొనిపోవుటగాని, ఆ భవనము డాబాపైన వారికి ఫలహారముల నొసగి వారిని సంతోషపరచుట గాని, బడిపిల్లలైన బాలబాలికల ననేకులను స్వయముగా వెంటబెట్టుకొనిపోయి పార్లమెంటు విశేషమును వారికి చూపించుటగాని మన పార్లమెంటు సభ్యుడు సర్వసాధారణముగా చేయు నిత్యకృత్యములుగా నుండును. పార్లమెంటు సమావేశము జరుగుచున్న కాలములో మన సభ్యుని కర్తవ్యము లిట్టి వంటివిగా నుండును. ప్రతివారము చివరను శని, ఆదివారములలోగాని, సమావేశములలో మధ్యమధ్య వచ్చు సెలవుదినములలోగాని, పెద్దసెలవులలోగాని మన పార్లమెంటు సభ్యుడు నిర్వర్తింపవలసిన కర్తవ్యములును, బాధ్యతలును ఎన్నో యుండును. పార్లమెంటులో జరిగిన విషయములనుగూర్చియు, అందులో తాను చేసిన పనిని గురించియు మధ్య మధ్య అతడు ఉపన్యసింపవలసియుండును. సాంఘిక, ధార్మిక, రాజకీయ సంబంధములైన సభల కతడు హాజరు కావలసియుండును.

కొన్ని సభల కత దధ్యక్షత వహింపవలసియుండును. కొన్ని బజారులు మొదలైన ప్రజోపయుక్త సంస్థల నతడు తెరువ వలసియుండును. ప్రజల కాహ్లాదకరములైన ఉద్యానవన విహారపు విందులలో పాల్గొనవలసియుండును. ఇంక నెన్నో వినోదములందు పాల్గొనవలసియుండును. ఇటువంటి సందర్భమునం దెల్ల స్థానిక పార్లమెంటు సభ్యు నాహ్వానించుచుందురు. అత డందు పాల్గొనవలసియుండును.

కామన్సుసభలో తన కాలము చాల వ్యర్థమగుచున్న దని పార్లమెంటు సభ్యుడు వాపోవుచుండును. ఒకొ్కక చర్చనీయాంశ మెప్పుడు వోటుకు పెట్టబడునో యని అతడు అప్రమత్తుడై యుండి తన పక్షమువారితో పాటు తన వోటునుకూడా ఇచ్చి ఆ విషయముపైన తమ పక్షమువారి అభిప్రాయమును బలపరచవలసియుండును. ఇది సులభమైన పనికాదు. ఒకొ్కక విషయముపైన నెవ్వరో చాలమంది గంటల తరబడి మాట లాడుచుందురు. ఒకొ్కకప్పు డది తలనొప్పి వచ్చునట్లుండును, ఒకొ్కకప్పుడు మన సభ్యుడే ఒక విషయమునుగూర్చి మాట లాడ దలపవచ్చును. అప్పు డతడు చర్చనీయాంశమునుగూర్చి తాను సేకరించిన సంగతులను వ్రాసికొనిన జ్ఞాపికల పత్రము లతో సభ్యులు కూర్చుండు ఆకుపచ్చని గుడ్డ కప్పిన బల్ల అంచున కామన్సు సభాధ్యక్షునకు కనబడునట్లు అతడు ఆతురతతో కూర్చుండియుండును. ఒక సభ్యుడు తన యుపన్యాసము సమాప్తిచేయగనే ఇతడు నిలిచి అధ్యక్షుని దృష్టి నాకర్షింపవలెను. అట్లతనిని ఆకర్షింపనిచో మాట్లాడుట కితనిని పిలువక ఇతనివలెనే నిలిచి యాతని దృష్టి నాకర్షింపగలిగిన మరి

రొక సభ్యుని మాట్లాడవలసినదని పిలుచును. ఇట్లు వేచి యుండగా పుణ్యకాలము గడచిపోవును. ఈ లోపున తాను మాటలాడదలచిన అంశములనే మరియొక సభ్యుని పెదవుల ద్వారమున సభ్యులకు నివేదింపబడుటయు జరుగును. కామన్సు సభలో కొన్ని కొన్ని సమయములలో అత్యంత ప్రాముఖ్యమైన విషయములు చర్చింపబడి తీర్మానింపబడుచుండును. అట్టి చరిత్రాత్మకమైన ఘట్టములలో తానుకూడ పాల్గొనుచున్నాను కదా యను సంతోషముకూడ మన సభ్యునికి కలుగుచుండును. ఈ కామన్సుసభవారి చర్చలు, చర్యలు, ఎంతో కాలహరణమును చేసి ఒక్కొక్కప్పుడు సభ్యుల శక్తిసామర్థ్యములను, వ్యర్థపుచ్చి గొప్పగొప్ప పురుషప్రయత్నములను, మహోన్నతాశయములను, ఆశలను వృధచేయుచున్నట్లుగూడ పరులకు తోచవచ్చును. దీనికొరకింతటి త్యాగము చేయుట యుచితమేనా యనిపించును. కామన్సుసభలో సభ్యులుగా నుండగా దాని విశేషము కనబడకపోవచ్చును గాని సభ్యత్వకాలము ముగిసి సభలోనుండి యావలకుపోయినవారు మాత్రము ఒకమారు వెనుకకు జూచికొని కొంత విచారముతో నిట్టూర్పు నూర్చుచుందురు.

1858 నాటి పార్లమెంటు సభ్యుల నిత్యజీవనమును గూర్చి మెకాలేగారి జీవిత చరిత్రను రచించిన ట్రెవిలియన్ గారిట్లు చెప్పియున్నారు :

"ఎంతో విసుగును శ్రమను కలిగించు రాజకీయ జీవనము, వోటుచేయుటకొరకు సాయంకాలము ప్రొద్దుపోవువరకును, అర్థరాత్రమువరకును గూడ వేచియుండుట, అటు తరు

వాత ఒక అడుగుతరువాత నింకొక యడుగు వేయుచు, "లాబీ"ల చుట్టు మఱిమఱి ప్రదక్షిణము చేయుచు మొత్తముమీద నొక అరమైలుదూరము నడుచుట, కలకలము మధ్య, గడబిడల మధ్య భుజించుటలు, ఒక ముద్దకు మఱియొక ముద్దకు మధ్య ఆకస్మికముగా సభాభవనమున నేదో యొక విషయము వోటుకు పెట్టగా సందు పార్లొనుటకు పరుగెత్తికొనిపోయి, తన వోటు నిచ్చుటకు ఇరువది నిముషములు గడుపవలసివచ్చుట, రాత్రి చాలా ప్రొద్దుపోయిన తరువాత, తెల్లవారుజామున మూడుగంటల వేళ ఫిబ్రవరి నెలలో కురియు వర్షమువలన రొచ్చుతో నిండియుండు వీధులలో నడచి ఇల్లు చేరుట, లండన్ నగర మధ్యమున నడివేసవిలో సభ్యులతో కిక్కిరిసి యుడికిపోవు పార్లమెంటు సభాభవనము మధ్యలో మంత్రుల వెనుక ముడుచుకని కూర్చుండియుండుటలు— ఇవి ఆనాటి పార్లమెంటు సభ్యుల వైభోగములు. తరువాత నలుబది సంవత్సరములకు కూడ పరిస్థితులిట్లేయుండెనని ఇతర గ్రంథములవలన తెలియుచున్నది. సర్ రిచార్డు టెంపిల్ అనునతడు భారతదేశములో గొప్ప ప్రభుత్వోద్యోగములు చేసివచ్చి 1885-1892 సంవత్సరములకు మధ్య ఇంగ్లాండులో పార్లమెంటు సభ్యుడుగా నుండెను. అతడు ఇంగ్లాండులో మంత్రివర్గమున పనిచేసికాని ఇతరవిధముగా ప్రాముఖ్యము వహించిగాని సుప్రసిద్ధుడు కాలేదుగాని కామన్సు సభ్యత్వమును మాత్రము ఆదర్శప్రాయముగా నిర్వహించి దానిని గ్రంథస్థము చేసి ప్రఖ్యాతి వహించినాడు.

ఈ సభ్యుడు కామన్సుసభాభవనమునందు తనస్థానమున తప్పక కూర్చుండియుండును. అట్లుగానిచో వోటు నిచ్చుటకై "లాబీ"లలో నడుచుచుండును. అతడు కొందరు స్నేహితులను, సాధారణముగా పార్లమెంటును చూడవచ్చిన స్త్రీలను వెంట నిడుకొని పార్లమెంటు సభాభవనములోని విశేషములను వారికి చూపించుచుండును. ఆయన పార్లమెంటు సమావేశములో నెన్నడును హాజరుకాకుండా మానలేదు. మొత్తము 2118 "డివిజనులు" అనగా సభ్యులు వోటు చేయుటకై విడివిడిగా నిలుచు సందర్భములలో 2072 టియం దాతడు పాల్గొనునని చెప్పుటవలననే అత డెంత శ్రద్ధ చూపుచుండెనో తెలియగలదు. ఆయన కేదో జబ్బుచేసినగాని, సభకు పోకుండ నుండడు.

పార్లమెంటు సభ్యుని నిత్యజీవనమునందు పార్లమెంటు సభ సమావేశ మగుచున్న సమయమున కొన్ని కొన్ని దినములలో ఊపిరి తిరుగనంతటి పని యుండుననియు, మఱికొన్ని దినములలో కొంచెము తక్కువపని యుండుననియు ఇతడు వ్రాసి యందుల కుదాహరణముల నిచ్చినాడు.

కొంచెము పనితక్కువగా నున్న దినమున పార్లమెంటు సభ్యుడు మూడుగంటలవేళ సభామందిరములో ప్రవేశించును. మూడున్నర గంటలకు ప్రశ్నోత్తరము లారంభమగును. ఇందులో మన సభ్యునికి ప్రసక్తి లేకపోవచ్చును. అందువలన నతడు తన నియోజకవర్గమునుండి వచ్చిన కొందరు స్త్రీ పురుషులనుగాని, వారి కుటుంబమునుగాని వెంటబెట్టుకొని పార్లమెంటు సభాభవనమునందు విశేషములు చూపుటకు బయలు దేరును. ఆ సమయమున సభలో మంత్రులు ప్రశ్నలకు జవా

బులు చెప్పెదురు గనుక సభ కిక్కిరిసియుండును. ఆ సమయ
మునసే ప్రఖ్యాత పురుషులైన కొందరు సభ్యులు తిరుగాడు
చుండుటకూడ చూడవచ్చును. తరువాత అతడు తన స్నేహితు
లకు సభామందిరమున పైనగల డాబామీద తేనీటి నిప్పించు
టకు తీసికొని వెళ్ళును. అటు తరువాత నతడు సభామంది
రమునకు వచ్చి తన స్థానమునందు కూర్చుండును. అప్పుడు
జరుగుచున్న చర్చలో నతడు పాల్గొనదలప లేడు. అందువలన
దాని నతడు చిరునవ్వుతో వినుచుండును. మధ్యమధ్య చిన్న
విషయములు తీర్మానించుటలో చేయబడు వోటింగులో నతడు
పాల్గొనును. ఇట్లు సాయంకాల భోజనసమయము వరకును జరు
గును' అప్పుడతడు తన స్నేహితులతో నొకడు సభామందిరము
డాబాపై నగల ఒకగదిలో నొసగుచున్న విందులో పాల్గొనును.
వీరట్లు భోజనము చేయుచుండగా నేదో యొక విషయము
సభలో వోటుకు పెట్టబడగా వోటు చేయుటకు రమ్మని
సూచించు విద్యుచ్ఛక్తి ఘంటారావము వినవచ్చును. అతడు
వెంటనే పోవనియెడల అతని వోటు తీసుకొనుట తప్పిపో
వచ్చును. అందువలన నతడు అక్కడికి పరువెత్తిపోయి వోటు
నిచ్చి తరువాత మఱలవచ్చి భోజనము పూర్తిచేయును. అటు
తరువాత తొమ్మిదిగంటలన్నర యగునప్పటికతడు మఱల
సభామందిరములోనికిపోయి ఆకుపచ్చని బెంచీలలో తన స్థాన
మున కూర్చుండి అక్కడ జరుగుచున్న చర్చలను వినును.
అప్పటినుండి అర్థరాత్రియగువఱకును ఆ చర్చలు జరుగుచునే
యుండును. ఈ మధ్య నత డొకమారు సభామందిరమున నంటి
యున్న పైవసారాలోనికిపోయి, రాజకీయముగ తనకు సంబం

ధీటులైన మిత్రులకు జాబులు వ్రాయును. అయితే ఆ సమయ
మున సభలో జరుగుచున్న సంగతులెల్ల అతనికి వినబడుచునే
యుండునట్లతడొక చెవి నావైపునకు బెట్టి వినుచునే తనకన్ను
కాగితముపైనుంచి వ్రాయుచుండును. పావుతక్కువ పండ్రెండు
గంటలవేళ "డివిజన్, డివిజన్" అని ఏదో యొక ముఖ్యవిష
యమును నిర్ణయించుటకు దానిని గూర్చి సభ్యుల సమ్మతా
సమ్మతములను సూచించు వోటు గైకొనబోవుచున్నారను
పిలుపు వినబడును. అంతట నతడు దానికి అనుకూలపు "లాబీ"
లోనికో, వ్యతిరేకపు "లాబీ" లోనికో పోయి తన వోటు
నిచ్చును. అర్థరాత్రమైన పిమ్మట మన సభ్యు డింటికి పోవును.

పని హెచ్చుగా నుండు దినమున మన సభ్యుడు పగలు
పదునొకండు గంటలకు సభామందిరమునకు వచ్చి పెద్దమెట్లు
నెక్కి ఏదో ఒక వ్యవహారమునకు సంబంధించిన ఒక ప్రయి
వేటు చిత్తు చట్టమును గూర్చి విచారించుట కేర్పడిన "కమిటీ"
లేక ఉపసంఘమువారు సమావేశమగు గదిలోనికి పోవును. ఆ
యుపసంఘమున కతడే యధ్యక్షుడై యున్నచో సాయంకా
లము నాలుగుగంటల వరకును అతడు తన దృష్టిని అటునిటు
మఱలించుటకైనా వీలుండదు. ఇంకొక సంగతి చెవిని జొర
వీలుండదు. ఈ లోపుగా అల్పాహారము నారగించుటకు కూడ
అవకాశముండదు. ఆ చిత్తుచట్టమును గూర్చి న్యాయవాదులు
చేయు వాదనల నతడు జాగ్రత్తగా వినవలెను. కుశాగ్రబుద్ధు
లైనవారు క్రమాక్రమములను గూర్చి, ప్రస్తుతాప్రస్తుతము

లను గూర్చియు చేయు "పాయింట్సు ఆఫ్ ఆర్డరు" అనబడు ఆక్షేపణలను గూర్చి తన నిర్ణయముల నొసగవలెను. ఆ చిత్తు చట్టమును ప్రతిపాదించినవారును దానిని ప్రతిఘటించువారును తెచ్చిన సాక్ష్యసాధనములను విచారించవలెను. ఆ యా విషయములందు ప్రవీణులైన వారి యభిప్రాయములను విమర్శింపవలెను. ఇట్లా దినమున చాల శ్రమపడి మఱల కామన్సుసభలో జరుగుచున్న సమావేశమునకు పోయి తన స్థానమున గూర్చుండును. అప్పుడేదో యొక ప్రశ్న నడుగుదునని యీవరకే తెల్పి యుండినందువలన సభాకార్యక్రమ ప్రణాళికాపత్రమునందచ్చు పడియుండుటవలన ఆ సమయమున కతడు హాజరుగ నుండవలెను. ఈ ప్రశ్నను పురస్కరించుకొని ఎదిరిపక్షములోని సభ్యులు చేయు అడ్డుసవాళ్ళను, వానికి ప్రభుత్వమంత్రి యోపికతో నొసగు ప్రత్యుత్తరములను ఇతడు వినవలసియుండును. అటుపిమ్మట సభలో నేదో యొకవిషయమును గూర్చి జరుగు గొప్ప చర్చ నితడు జాగ్రత్తగా వినుచు, అందులో పాల్గొనదలచి మాటలాడుటకై అధ్యక్షుని అనుమతిని పొందుట కతడప్పుడు లేచి నిలుచును గాని సభాధ్యక్షు డితనిని గమనింపక మఱియొక సభ్యుని జూచి అతనికి మాటలాడుట కనుజ్ఞ నిచ్చుట వలన నితడాశాభంగమును జెందుచుండును. తుదకు గడియారపు ముల్లు ఎనిమిదిగంటలవైపు చూపుసమయమున నితడధ్యక్షుని దృష్టి నాకర్షింపగలుగును. అంతట నాయన ఇతనిని పిలిచి మాటలాడుట కవకాశమిచ్చును. అయితే ఇంతలోనే అరగంట

విరామకాలము వచ్చును. ఈలోపుగ నతడు భోజనము చేసి వచ్చుటకు వ్యవధి లేదుగనుక ఫలహారకాలకుపోయి, అల్పాహారమును బుచ్చుకొని మరల సభసమావేశమగుటకు కొన్ని నిముషములకు ముందుగనే వచ్చి తన స్థానమున నుండును. అట్లు చేయనిచో తాను ఇంతసేపటినుండి మాటలాడుటకు వేచి యుండిన అవకాశము మించిపోవును. ఎనిమిదిన్నర గంటల వేళకో మఱి కొంచెముసేపటికో అతడు తన యుపన్యాసము నొసగును. తొమ్మిదిగంటల తరువాత నతనికి కొంచెము మనశ్శాంతి కుదురునుగాని ఇంతలో ఎవరో యొకరు ఇతని యుపన్యాసమును ఖండించి దానిని తగురీతిని శిక్షింతురు. ఆ విమర్శకుడు తాను చెప్పినదానికి అపార్థమును చెప్పుచున్నాడని నితనికితోచగా నితడొకటి రెండుసారులు తటాలున లేచి నిలిచి సభవారి యనుమతితో తన భావమును వెల్లడిచేయును. ఇది యంతయు అగునప్పటికి రాత్రి రమారమి పండ్రెండుగంటలు కావచ్చుచుండును. అప్పుడా విషయమునుగూర్చి వోట్లు తీసికొనబడును. అటుతరువాత విద్యావిషయమునకు సంబంధించిన పెద్దమనుష్యుడొకడు ప్రతిపాదించిన యొక విషయము చర్చకు వచ్చును. అర్థరాత్రి దాటినతరువాత పార్లమెంటులో చర్చలు జరపరాదను నియమము ఇటువంటి విషయములకు వర్తింపదు. రాత్రి ఒకటిన్నర గంటలవరకును ఈ చర్చసాగును. అప్పుడు దానిని గూర్చి వోట్లుగైకొనగా సభముగియును. అంతట మనసభ్యుడు చాల డస్సిపోయి ఇంటికి పోవును.

పార్లమెంటు నిత్యజీవనమును గూర్చిన యీ వర్ణనము ఇప్పటికిని కొలదిమాత్రపు మార్పులతో సరిపోవుచున్నది.

1902 కు పూర్వములో జననమయమున నొక అరగంట సభకు విరామముండెనుగాని ఇప్పుడట్లుగాక నిరంతరముగా జరుగుచుండును. అధ్యక్షుడు భోజనమునకు వెళ్ళినప్పుడు ఉపాధ్యక్షుడు అగ్రాసనాధిపత్యము వహించును. ఇటీవల సభ రాత్రి 11 గంటలవరకు మాత్రమే సమావేశమగుచున్నది.

* సర్ కోర్ట్ని ఇల్బర్టుగారు వ్రాసిన 'పార్లమెంటు' అను గ్రంథము నాధారపరచుకొని ఈ వ్యాసము వ్రాయబడినది.



# పార్లమెంటు అభ్యర్థుల నియామకము

భారతదేశమున పార్లమెంటుకును వివిధ రాష్ట్రీయ శాసనసభలకును 1952లో జరిగిన ఎన్నికలలో పోటీచేయుటకు అభ్యర్థులను నియమించు సందర్భములో కాంగ్రెసు అధిష్ఠాన వర్గము వారొక పార్లమెంటరీబోర్డు నేర్పరచిరి. ప్రతిరాష్ట్రములో రాష్ట్రకాంగ్రెసులోని పరిపాలకవర్గమువారును కొందరు మంత్రులునుకలిసిన పార్లమెంటరీ ఉపసంఘము లేర్పడి ఆయా ప్రాంతములలో పర్యటనము సలిపి అభ్యర్థుల దరఖాస్తులను పరిశీలించి ఒక జాబితాను తయారుచేసి పైవారికంపసాగిరి. ఈ సందర్భమున జిల్లా తాలూకా కాంగ్రెసు కమిటీల అభిప్రాయములను ఉపసంఘమువారు స్వీకరించిరి.

కాంగ్రెసులో సభ్యులుగానివారు చాలమంది కాంగ్రెసు అభ్యర్థులుగా నియమింపబడుటకు దరఖాస్తులు పెట్టుకొనుట వల్లనే కాంగ్రెసుకు గల పలుకుబడి తెలియగలదని ఒక మద్రాసుమంత్రి యొక సందర్భమున పలికెను.

కాంగ్రెసు తరపున అభ్యర్థులను నియామకముచేయుటలో ఆయా అభ్యర్థులు పోటీచేయవలసియున్న నియోజక స్థానములలోని ప్రజలకు వోటర్లకు కాంగ్రెసు సభ్యులగు ఆ యభ్యర్థుల విషయమై తమ యిష్టానిష్టములను వెలిబుచ్చుటకును తగిన అభ్యర్థిని పేర్కొనుటకును అవకాశము లేకుండ పోయినది. అభ్యర్థుల నియామకములో వారి యభిప్రాయములను గమనించినట్లే తోచదు. ఉపసంఘమువారికి స్థానిక కాంగ్రెసు నాయకులు నియోజకస్థానములోని కులములను

గూర్చి వివిధ వర్గములనుగూర్చి కొన్ని విషయములను చెప్పు చురనుటకు సందేహము లేదు. కొన్నికొన్ని ప్రాంతములలో నేకులమువా రధిక బలవంతులుగా నుందురో ఆ కులము వారిని సంతృప్తిపరచవలసి వచ్చుచుండుననియు వారి కిష్టుడైన అభ్యర్థిని నియమించవలసివచ్చుచుండుననియు నీ సందర్భమున మద్రాసు మంత్రియైన పెరుమాళ్ళస్వామిరెడ్డిగారు అంగీకరించి యున్నారు. ఎవరి వోట్లవలన అభ్యర్థి యెన్నుకొనబడవలసి యుండునో ఆ నియోజకవర్గము వారి అభిప్రాయములను గమనించుట యనునది ఈయొక్క సందర్భమున మాత్రమే సూచింపబడినది. అట్టి పరిస్థితులలో కూడా అధికసంఖ్యాక కులము వారి అభిప్రాయము తప్ప అల్పసంఖ్యాకుల కులముల వారి అభిప్రాయములను మన్నించిన లక్షణములు కానరాలేదు. అభ్యర్థుల యోగ్యతలును, వివిధ సంస్థలును వ్యక్తులును వెల్లడించు అభిప్రాయములును జాగ్రత్తగా గమనింపబడునని పెరుమాళ్ళస్వామిరెడ్డిగారు మెయిలుపత్రికా విలేఖరితో చెప్పిరిగాని నియోజకస్థానము నందలి వోటరుల అభిప్రాయములను వివిధ స్థలవారు తెలిసికొన్నారనుటకు తగిన నిదర్శనము లేదు. యభిప్రాయము సాధారణముగా నందులోని ప్రముఖుని యభిప్రాయముగనే యుండును. పార్లమెంటు అభ్యర్థుల నియామకము విషయమున ఇంగ్లాండులో నవలంబింపబడు పద్ధతులనుగూర్చి మద్రాసు మెయిలుపత్రిక 26-9-1951 తేదీన నొక సంపాదకీయ వ్యాసమును వ్రాసినది.

పార్లమెంటుకు ఎన్నుకొనవలసిన అభ్యర్థులను నియమించు అధికారము ఇంగ్లాండులోని వివిధ నియోజకస్థానముల

లోని వారిదే. ఇంగ్లాండులోని వివిధ రాజకీయపక్షములలో కమ్యూనిస్టుపార్టీ తప్ప చాల నిరంకుశముగా (authoritation) ప్రవర్తించు లేబరుపక్షమువారు కూడా నియోజకస్థానము లందలి ప్రజల యభిప్రాయము నీ విషయమున మన్నింతురు. పార్లమెంటు ఎన్నికలకు నిలుచు అభ్యర్థులను ఆయా నియోజక స్థానమునకు చెందిన లేబరుసంఘ సభవారే నిర్ణయింతురు. ఆ నియోజక లేబరు సంఘమువారు నిలిపిన అభ్యర్థి అఖిల ఇంగ్లాండు లేబరుపక్ష సంఘమువారి కార్యనిర్వాహకవర్గము వారు (నేషనల్ ఎగ్జిక్యూటివు) ఆమోదించవలెనను సంగతి నిజమేకాని సాధారణముగా వారామోదించకపోవుట జరుగదు. నియోజకస్థానములోని లేబరుసంఘమువారు పేర్కొనిన అభ్యర్థి లేబరుపార్టీ వారి వ్యవహారములందు పాల్గొనినవాడై యుండిన సంగతి, అతనికా నియోజకస్థానమునందు పలుకుబడియున్న సంగతి నేషనల్ ఎగ్జిక్యూటివు వారికి తెలిసియే యుండును.

ఇంగ్లాండులో అభ్యర్థులు కేవలము ధనవంతులైనందు వల్లనగాని తమ రాజకీయపక్ష కార్యనిర్వాహకవర్గము వారి దగ్గర పలుకుబడిని సంపాదించుటవలనగాని పార్లమెంటులో ప్రవేశము పొందజాలరు. వారు నియోజకస్థానములోని రాజకీయ వ్యవహారములందు తగు తర్ఫీదును పొంది నియోజక వర్గములోని వోటరులకు తమ శక్తి సామర్థ్యములను రుజువు చేసినవారై యుండవలెను.

ఇంగ్లాండులోని కన్సర్వేటివు పక్షమువారును లిబరలు పక్షమువారును కూడా అభ్యర్థుల నియామకములో ఆయా నియోజకస్థానములకు చెందిన స్థానిక సంఘములకు స్వాతం

త్ర్యము నొసగుదురు. నియోజకస్థానములందలి స్థానిక లిబరలు సంఘములు తమ వ్యవహారములనెల్ల తామె నిర్వహించు కొనుటకు సర్వస్వాతంత్ర్యములను కలిగియుందురు. ఇంగ్లీషు లిబరలుపార్టీవారికి రాజకీయములందు గల శక్తియు బల హీనతయు గూడ నిందువలననే యేర్పడినవి.

కన్సర్వేటివు పక్షమువారు రాజకీయముగా అక్కడ కట్టుదిట్టముగ వ్యవహరింతురు. వారి కేంద్ర కార్యనిర్వాహక సంఘమువారి కెక్కుడు అధికారములున్నవి. అయినప్పటికిని నియోజకస్థానములందు అభ్యర్థులను నియమించుటలో నాయా నియోజకవర్గముల వారి అభిప్రాయములు మన్నింపబడు చుండును.

1949 అక్టోబరులో జరిగిన కన్సర్వేటివ్ అండ్ యూని యనిస్టు అసోసియేషను వారి 17 వార్షిక సమావేశమునం దీవిషయము చర్చకు వచ్చినప్పుడు ఈ పక్షమువారి గౌరవ మును వారు దేశమునకు చేయు సేవయు, ఎన్నికలలో నియ మింపబడు అభ్యర్థులయొక్క శక్తి సామర్థ్యములపై నాధారపడి యుండునని వారు తీర్మానించినారు.

కన్సర్వేటివు సభవారీవిషయమై ఇంక నిట్లు తీర్మా నించిరి. "ఆయా నియోజక స్థానములందు అభ్యర్థులను నిలువ బెట్టుటలో నియోజకవర్గములకు పూర్ణ స్వాతంత్ర్య ముండవలె నని యీ సభవారు అంగీకరించుచున్నారు. అభ్యర్థుల నియా మకముకొరకై ఏర్పాటుచేయబడిన స్థాయి సంఘమువారు అభ్యర్థులెల్లరు ప్రజాజీవనమునందలి అన్ని స్థాయిలలోను గల స్త్రీ పురుషులలో సచ్ఛీలురుగను, సమర్థులుగను, రాజకీయ పరి

జ్ఞానము కలవారుగను ఉండునట్లు చూడవలెను...ఆయా అభ్య ర్థుల వ్యక్తి స్వాతంత్ర్యములను జాగ్రత్తగా కాపాడుట యను నది కన్సర్వేటివు పక్షమువారియొక్కయు, ఆంగ్లజాతి యొక్కయు క్షేమమునకు చాల ముఖ్యమైన యంశము గనుక ఆయా అభ్యర్థుల వ్యక్తి స్వాతంత్ర్యమున కెట్టి భంగమును కలుగకుండునట్లు చూడవలెననే సంగతిని హెచ్చరించు చున్నారు."

ఇట్లు పార్లమెంటు ఎన్నికలకు సభ్యులను నియమించు విషయమున మానవుడు తీసికొనదగిన జాగ్రత్తనంతను తీసి కొనబడినదనుటకు సందేహము లేదు. ఈ పద్ధతి స్మెహుగారి యుద్దేశమునకు అనుగుణముగ నున్నది. అందువలన భారత దేశ మున పార్లమెంటునకును వివిధ రాష్ట్రములలోని శాసనసభల కును అభ్యర్థులను నియమించుటలో నీ పద్ధతులను గమనించి నచో దేశములోని అన్నివర్గములవారికిని ప్రాతినిధ్యము వహింప గలట్టియు, దేశమునకును ప్రజలకును చక్కగా సేవచేయ కలట్టియు సభ్యులు ఎన్నుకొనబడుదురు. అయితే ప్రస్తుతము జరుగుచున్నట్లు కేవలము రాజకీయపక్షమువారి కార్యనిర్వా హక సంఘమువారు దేశములో పర్యటన జరిపి అభ్యర్థులను నియమించినచో స్వార్థపరులైనవారే ప్రజాసంస్థలందు ప్రవే శించుట తటస్థించగలదని మెయిలు పత్రిక హెచ్చరించినది.

# ప్రజాప్రభుత్వము-ప్రజాభిప్రాయము-ప్రజాభిమతము

ప్రజల ప్రతినిధులు ప్రజల క్షేమలాభముల నాలోచించి దేశపరిపాలనము చేయుటయు ప్రతి విషయమునను దేశప్రజలలో బహుసంఖ్యాకుల యభిమతానుసారముగా ప్రవర్తించుటయు ప్రజాప్రభుత్వములోని ముఖ్యలక్షణములు.

ప్రభుత్వ వ్యవహారములను గూర్చి కార్యాలోచనము చేయు పార్లమెంటు శాసనసభ్యులును వానిని నిర్వహించు మంత్రులును గూడ ఈ సూత్రముల ప్రకారము ప్రవర్తింప వలసియుందురు.

ప్రజాప్రభుత్వముగల దేశములందు ప్రజలందరును తమ యభిప్రాయములను పత్రికలందు, పుస్తకములందు, సభలందు, స్వేచ్ఛగా వెల్లడించుటకు స్వాతంత్ర్యమును కలిగియుందురు గనుక పార్లమెంటులోని సభ్యులును మంత్రులును ప్రభుత్వమువా రవలంబించు పద్ధతులును, చేయు శాసనములును, జరుపు చర్యలును ప్రజలకు సమ్మతములో అసమ్మతములో సులభముగా గ్రహించుటకు వీలున్నది. ఏ విషయమునుగూర్చియైనను ప్రజలు కొందరు వ్యతిరేకాభిప్రాయమును గనబరచినచో పార్లమెంటు సభ్యులును, మంత్రులును దాని మంచిచెడ్డలను గురించి ప్రజలలో ప్రచారముచేసి దానికి అనుకూలమైన ప్రజాభిప్రాయమును కలిగించవచ్చును. అట్లు ప్రచారముచేసినను పిమ్మటగూడ ప్రజలలో బహుసంఖ్యాకులు వ్యతిరేకులుగా

నున్నచో సభ్యులును మంత్రులు నా విషయములను విరమించ వలెను. లేదా తమ పదవులను వదలుకొనవలెను ఇది ప్రజా ప్రభుత్వములుగల నాగరక దేశములందలి రాజ్యాంగ మర్యాదగ నున్నది. అందువలన ప్రభుత్వవ్యవహారములెల్ల ప్రజాభిమతాను సారముగా జరుగుట కనకాశము ఏర్పడినవి.

నాగరకత అభివృద్ధిగాంచిన కొలది, ప్రజలలో విద్య వ్యాపించినకొలది, విజ్ఞానవ్యాపనమునకు మార్గములైన ముద్రణాయంత్రములు తంతి తపాలా రేడియో సాధనములు అభివృద్ధిగాంచిన కొలది, జన సామాన్యములోని క్రింది తరగ తులవారు హెచ్చు అధికారములు కోరసాగినారు. ప్రజా ప్రభుత్వ విధానమునందు ఎక్కువ సమ్మకము లేని పాశ్చాత్య రాజనీతిజ్ఞులు కూడా ప్రజాప్రభుత్వము పేరిటనే వ్యవహరింప సాగినారు. ఈ కారణమువలన కేవలము అభివృద్ధికి వ్యతిరేక మైన 'ప్రతీప' కరశాసనములు (Reactionary acts) కూడ, ప్రజలక్షేమముకొరకు శాసింపబడుచున్నట్లుగనే ప్రకటింప సాగిరి.

అమెరికా ప్రభుత్వాధ్యక్షుడైన అబ్రహాంలింకను ప్రజా-ప్రభుత్వమనునది ప్రజలవలన ప్రజలకొరకు నిర్వహింప బడు ప్రజలయొక్క ప్రభుత్వముగా నుండవలెనని సూత్రీకరించి యున్నాడు. నేటి ప్రజాప్రభుత్వ మీ సూత్రమునకు అనుగుణ ముగా నుండకపోయినను అది ప్రజాభిమతము (పబ్లికు ఒపీని యన్) ప్రకారము జరుగు ప్రభుత్వముగా నున్నది. 1914 నాటి ప్రపంచయుద్ధముతో నావిష్ణుః పృథ్వీపతి యను సూత్రము పూర్తిగా మాయమైనది. ప్రపంచంలోని గొప్పదేశములందలి

ప్రజాప్రభుత్వములెల్ల నేడు ప్రజలపేరిటనే జరుగుచున్నవి. వివిధ రాజ్యములందలి రాజకీయనాయకులు ప్రజాభిప్రాయము నకు దోహదముచేసి పోగడ్తలతో వారిని తమ కనుగుణము చేసికొందురు. ప్రజల స్వార్థలాభమున కనుగుణములైనట్టియు వారి యాశలను రగుల్కొల్పునట్టియు వారి చిత్తవృత్తులను ప్రేరేపించునట్టియు హెచ్చరికలుచేసి, ప్రజాభిప్రాయమునందు గల భిన్నభిన్నపథములను సమన్వయముచేసి సమాధాన పర తురు. మరియు ప్రజాభిప్రాయమును లోంగదీసి హద్దులలో నుంచుదురు.

ఇటీవల రాజకీయనాయకు లొక క్రొత్తపుంతను త్రొక్కి ఒక పద్ధతిని అవలంబింపవలసి వచ్చినది. ఇప్పుడు నాగ రక దేశము లన్నిటిలో స్త్రీపురుషు లందరకును "వోటుహక్కు" కలదు. విజ్ఞాన వ్యాపనమువలన ప్రజలలో తెలివితేట లేర్పడి నవి. దినదినాభివృద్ధి గాంచుచున్న పారిశ్రామికయుగము నందలి విచిత్ర యంత్రసాధనములెల్ల ప్రజానీకమునందు దృఢాభి ప్రాయము లేర్పడుటకు, వ్యాపించుటకు తోడ్పడుచున్నవి. లక్షల కొలది చవుకబారు పత్రికలను ప్రకటించు ముద్రాక్షర శాలలందవి లక్షోపలక్షలుగా ప్రకటింపబడుచున్నవి. వివిధ విష యములనుగూర్చిన గ్రంథములు, ఆవిరి యంత్రములు, విద్యు చ్ఛక్తి, రైళ్ళు, పొగయోడలు, తంతివార్త, టెలిఫోను, రేడి యోలు ప్రజానీకమునందు విజ్ఞానము నభివృద్ధిచేసి వారిలో క్రొత్తవాంఛలను కలిగించుచున్నవి. పూర్వము ప్రజాప్రతినిధిగా నిలిచిన అభ్యర్థి కష్టపడి యూరూరతిరిగి నియోజకుల సభలం దుపన్యసింపవలసి వచ్చుచుండెను. ఇప్పుడత డొకచోటనుండి

అసంఖ్యాకులగు ఓటరులను కదల్చకుండ తన వాగ్దానములను తన హెచ్చరికలను రేడియో ద్వారమున చెప్పి వారి మనస్సులను మార్చవచ్చును.

ప్రజాభిమతమును మార్చుటకు ఇన్ని విధములుగా ప్రయత్నించుటకు వీలైన ఈ కాలమునందు వీనివలన అనర్థములుకూడ హెచ్చుగనే యున్నవి. పూర్వముకన్న నీ కాలమునందు ఉచ్చనీచములు లేని ఉపన్యాసకులకు, వార్తా పత్రిక సంపాదకులకు ప్రజలను మోసగించి వారి మనస్సులు విరచుటకు హెచ్చు అవకాశము లున్నందున వారెక్కుడు బలవంతులైనారు. ఈ పరిస్థితులలో ప్రజలకు పార్లమెంటుసంస్థలందు గౌరవము సన్నగిల్లినది. ప్రజాభిప్రాయ ప్రకటన సాధనముల నెల్ల చేజిక్కించుకొన్న బలవంతులు దాని నిటునటు ఊగులాడించునట్లు చేయగలుగుదురు. ఇదియే నిజమైన ప్రజాభిప్రాయమను పొరపాటు అభిప్రాయముతో మహోపన్యాసములిచ్చి దానికి దాసులుగా ప్రవర్తించు పార్లమెంటు సభ్యులయందు గౌరవము సన్నగిల్లుటలో నాశ్చర్యమేమున్నది? రాజనీతికి బద్ధమైయుండు పూర్వకాలము నాటి "లిబరల్" మితవాద సంప్రదాయము బలహీనమై కేవలము అనుదారవాదులైన "కన్సర్వేటివు" లొక ప్రక్కను సంఘవ్యవస్థనే తారుమారు చేయుదలచు "బోల్షివికు" (కమ్యూనిస్టు) పక్షీయు లింకొక వంకను ఎట్టి రాజీమార్గములును లేక పోరాడుచున్నారు. అధిక సంఖ్యాక వర్గములు అల్పసంఖ్యాక వర్గముల హక్కులను గౌరవించు పూర్వపు మర్యాదలే పోయినవి.

ప్రజాప్రభుత్వమునందలి సర్వసమానత్వ సూత్రమను నది ప్రస్తుతము ఏకపాక్షికముగ నున్నదని చెప్పవలసివచ్చు చున్నది. ఏలన బలవంతులు ధనవంతులై ప్రభుత్వమును నడు పుచున్నవారు సామాన్యులపట్ల దయదలచి ఒసగు సమానత్వ ధర్మముగా కనపడుచున్నది. ఒకవేళ సమానత్వమనునది నిజ మే  యైయున్నను అందరకు సమానమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యము లుండుననుటకు మాత్రము వీలులేదు. సర్వసమానత్వమును అమలు జరుపుటలో నేటి ప్రజాప్రభుత్వము పూర్వకాలము నాటి నిరంకుశప్రభుత్వములవలెనే ప్రజాపీడనము గావించు చున్నది. సామాన్యపౌరులు కదలను మెదలను లేకుండ నిర్బం ధించి పౌరజీవనమునందలి సామాన్యపు అలవాటులను వారి స్వంత వ్యవహారములనుకూడ నిరోధించునట్టి జడయంత్రముల వంటి ప్రభుత్వోద్యోగివర్గములను సృజించి ప్రజల స్వేచ్ఛను స్వాతంత్ర్యములను హరించుచున్నవి. పెద్దపెద్ద సైన్యముల వంటి ఉద్యోగ సముదాయములను గుమాస్తాల గుంపులను నియమించుట. ప్రజాజీవనమునందు జోక్యం కలిగించుకొనుట వీనికి చాల ప్రీతికరములుగా కనబడుచున్నవి.

పూర్వకాలమునాటి లిబరల్-ఉదారవాదుల ప్రజా ప్రభుత్వమునందలి మానవుల వ్యక్తిత్వమునకు కొంత సౌక ర్యము లుండెను. ఇటీవల పాశ్చాత్యదేశములందు వర్ధిల్లు చున్న పారిశ్రామిక ప్రజాజీవనమునందలి ప్రజాప్రభుత్వమున ప్రజల వేషభాషలలో మర్యాదలలో తమ చిత్తవృత్తులలో కూడా ఒకే విధమైనపద్ధతి యుండవలెనను ఒక ఊహ ప్రబలి నది. ఏ విషయముననూ ఎట్టి తారతమ్యములు నుండరాదను

భావము వ్యాపించినందువలన తెలివితేటలు, శక్తిసామర్థ్య
ములు మందగించి ఎట్టిమార్పులు లేని ఆచారములు ప్రబలు
చున్నవి. యంత్రమునకు మానవుడు దాసుడైనందువలన బుద్ధి
చాతుర్యము, మార్పు, వ్యక్తిత్వము పనితనము నశించు
చున్నవి. పరిశ్రామిక పరిస్థితులందలి ప్రజాప్రభుత్వములోని
నష్టము లివి. అయితే ఇందు కొన్ని లాభములు లేకపోలేదు.
సంఘమునం దత్యున్నతపథమునందున్న వారికిని, అధోగతిలో
నున్నవారికిని మధ్యనుగల తారతమ్యము చాలవరకు తగ్గినది.
గొప్పవాడు మిక్కిలి గొప్పవాడుగా గాని, బీదవాడు కడుబీద
వాడుగా గాని యుండడు. ప్రజలలో నేదోయొకవిధమైన విద్య
వ్యాప్తిజెందినది. ప్రజాప్రభుత్వ నిర్వాహణమే, పౌరులకు దిన
దినమును పొందునట్టి యొక విద్యాభ్యాసముగా నున్నది.
ప్రభుత్వ వ్యవహారములెల్ల గోప్యముగా గాక బహిరంగముగ
జరిగి ప్రకటితములగుచున్నందువలన సామాన్యపౌరులు క్రమ
ముగా విజ్ఞానము సంపాదించి ప్రభుత్వ వ్యవహారపద్ధతులను
తెలిసికొని దాని బాధ్యతలను గ్రహించుచుందురు. క్రమక్రమ
ముగా ప్రజలలో చాలమంది తెలివితేటలతో తమ ఓటునిచ్చి
తమ అభిమతములను ప్రకటించుచున్నారు. స్త్రీలుకూడ
జాతీయ జీవనమునందు పాల్గొనుచున్నారు. అయితే దీనివలన
గృహనిర్వాహకత్వమునందు కొన్ని లోపము లేర్పడి కుటుంబ
సౌఖ్యమునకు కొరత లేర్పడుచున్నవి. కార్మికులకు పూర్వము
కన్న హెచ్చుకూలీ లభించుచున్నది. వారు తక్కువకాలము
కష్టపడుచున్నారు. వారిజీవనవిధాన మభివృద్ధిచెంది ఎక్కువసౌఖ్య
మనుభవించుచున్నారు. ఐహిక సుఖాభివృద్ధికి హెచ్చు అవకా

శము ఏర్పడినవి. రాకపోకలు సులభములైనవి. చవుకగను త్వరితముగను ప్రయాణము జేయుటకు వీలగుచున్నది. వివిధ ప్రాంతములందలి ప్రజలొండొరులకు సన్నిహితులు కాగలుగు చున్నారు.

పూర్వముకన్న ప్రజాప్రభుత్వ సిద్ధాంతము సర్వజనాంగీకారమైనది. అయితే ప్రకృతియు మానవ ప్రకృతియు సర్వ సమానత్వమునకు కలిగించు ఆటంకములెల్ల క్రమక్రమముగా విద్యావ్యాపనమువలన తొలగినగాని ప్రజాప్రభుత్వము సంపూర్ణముగా సార్థకము కాజాలదు. "స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాతృత్వము" అను ఫ్రెంచిదేశ ప్రజావిప్లవవాదుల సిద్ధాంతములు త్రికరణశుద్ధిగా అమలుజరిగిన గాని సామాన్య ప్రజలు ప్రజాప్రభుత్వమువలని లాభములెల్ల సంపూర్ణముగా పొందజాలరు. ప్రజాయత్తమై ప్రజలచే నిర్వహింపబడు ప్రభుత్వమునందు ప్రజలెల్లరును సంపూర్ణముగా పాల్గొని తమ జీవితములను సార్థకముజేసికొనుటకు సంపూర్ణమైన స్వాతంత్ర్యము రాజకీయముగను ఆర్థికముగను ఎట్టి తారతమ్యములు లేని సర్వసమానత్వము, సాంఘికముగా పరస్పర ప్రేమను పురికొల్పగల సౌభ్రాతృత్వమును స్థాపింపబడవలెను. ఎన్ని యుద్ధములు జరిగినను, ఎన్ని రాజకీయవిప్లవములు జరిగినను ఎన్ని సంస్కరణములు జరిగినను జనులలో ఆర్థిక తారతమ్యములు పూర్తిగా పోలేదు. ఇప్పటికిని ధనికులైన కొలదిమంది ప్రభుత్వమును నడుపగలుగుచున్నారు.

మానవుడు అరిషడ్వర్గములకును అజ్ఞానమునకును దాసుడై యున్నాడు. ఈ దుర్గుణములు వీడినగాని ప్రజాప్రభు

త్వము సార్థకముగాదు. ప్రజలలో సుహృద్భావము వ్యాపింపని యెడల ఒక వ్యక్తియొక్క నిరంకుశపరిపాలనకు బదులుగా ఒక అల్ప సంఖ్యాకవర్గమువారి నిరంకుశపరిపాలనమున గాని ఊగులాడుచుండు అధిక సంఖ్యాక జనముయొక్క నిరంకుశపరిపాలనమునగాని ప్రజలు పీడింపబడుచుందురు. నిజమైన ప్రజాప్రభుత్వమునందలి యధికారము వారి బలప్రయోగముపైనగాని అధికసంఖ్యాకవర్గమువారి చిత్తముపైనగాని, ఆధారపడక పౌరులందరియొక్క ఏకగ్రీవపు అంగీకారముపైననే ఆధారపడును.

# ప్రజల హక్కులు

ప్రతి మనుష్యుడు తన జీవనార్థము స్వేచ్ఛగా కష్టించుటకును, తన కష్టమునకు తగిన వేతనమును పొందుటకును హక్కు కలిగియున్నాడు. తగిన జీవనోపాధిని కల్పింపగల ప్రతిఫలమతనికి చెందవలయును. అతడు కష్టించుకాలమనుకూడా అత్యధికముగాక, కొన్ని గంటలు మాత్రమే యుండవలెను.

పౌరసత్వముయొక్క బాధ్యతలను నిర్వహించుటకు వలసిన శక్తిని కలిగింపగల విద్యను పొందుటకును ప్రతిపౌరుడు అర్హుడై యున్నాడు. అట్లని ప్రతి పౌరునికి నొకేవిధమగు విద్య యుండవలెననికాదు ప్రతివ్యక్తికినిగల సహజ శక్తి సామర్థ్యములను బట్టి వానివానికి తగిన విద్య తర్ఫీను నొసగవలయును.

సామాన్యపౌరుని యభిమతమునకు ప్రభుత్వాధికారమునకు పలుకుబడి కలిగియుండుట కవకాశములుగల విధానమే ప్రజాప్రభుత్వవిధానమని వ్యవహరింపబడును. ఈ పద్ధతి యందలి మొదటి హక్కు నియోజనాధికారము. అనగా ఎన్నికహక్కు; పరిపాలనము నెవ్వరు నిర్వహింపవలెనో వారిని పేర్కొనుహక్కు ప్రతివ్యక్తికి నుండవలయును. రెండవహక్కు: అట్లు పేర్కొనబడుటకుగూడ ప్రతివ్యక్తికిని అవకాశముండుట. మూడవహక్కు: తనకు గావలసిన సంగతులను గూర్చి వ్యక్తపరచుటకు పరిపూర్ణావకాశములుండుట. ఇందుకొరకు వాక్స్వాతంత్ర్యము - దీనిని సార్థకము చేయగల సర్వస్వాతంత్ర్యములు నుండవలయును. రాజకీయములందు తప్ప తక్కిన అన్ని విషయములలోను పాశ్చాత్య ప్రపంచమునందిట్టి పరి

పూర్ణ స్వాతంత్ర్యము గానవచ్చుచున్నది. ఒక పురుషుడు నేడట్టి మతాభిప్రాయములనైన గలిగియుండవచ్చును. తుదకు నాస్తికుడు కూడా కావచ్చును. ఎట్టి చిక్కును లేదు. అయితే రాజకీయములందు మాత్రమిది సిద్ధింపలేదు. ప్రస్తుతము స్థిర పడియున్న పరిస్థితులకును, క్రమపద్ధతికిని విరుద్ధములగు అభి ప్రాయములెల్ల అశాస్త్రీయములనియు, అవి యణచివేయబడ వలయుననియు నేటి నాగరక రాజ్యాంగములయొక్క సిద్ధాంత ముగా నున్నట్లు తోచుచున్నది. ఒకొక్కప్పుడొక యభిప్రా యము స్వతస్సిద్ధముగనే పీడాకరమని నిషేధింపబడుచున్నది. ఒకొక్కప్పుడది ప్రభుత్వ విధానమునకు భంగకరమని నిషే ధింపబడుచున్నది. ఇంకొకప్పుడు శాంతికి భంగకరమని నిషే ధింపబడుచున్నది.

ఒకపౌరుడు వ్యక్తిగతముగగాని, నలుగురితో కలసిగాని తనయభిప్రాయములను స్వేచ్ఛగా ప్రకటించుటకు వీలుండ వలయును. మఱియు సర్వసామాన్య ప్రకటన సాధనములన్నిటి ద్వారా తనయభిప్రాయములను వెల్లడించుటకు వీలుండవల యును. ఇదియెల్ల ప్రభుత్వముయొక్క ఆదరణముక్రింద చేయగలుగుటయే నిజమగు స్వాతంత్ర్య లక్షణము. ఒక వ్యక్తి ప్రస్తుతపు సాంఘిక వ్యవస్థయొక్క అననుకూలతను గూర్చి బోధించి దానిని బలవంతమగు విప్లవముచేత విచ్ఛిన్నము చేయ గోరవచ్చును. లేక ప్రస్తుతపు రాజ్యాంగవిధానము కేవలము ధర్మస్వరూపమే యని చెప్పవచ్చును. తన యభిప్రాయమునకు విరుద్ధములుగనున్న అభిప్రాయములెల్ల తీవ్రముగా అణచి వేయబడవలెననియు కోరవచ్చును. నిజముగా వాక్స్వాతంత్ర్యము

లేని ప్రజలు తమ యంతరాత్మ బోధనల ప్రకారము, అనుభవ
సిద్ధ విషయమునుగూర్చి సైతము, స్వేచ్ఛగా ఆలోచించుకొన
కుండ నిరోధింపబడుటవలన కొన్నాళ్ళకు యుక్తాయుక్త వివే
చనాశక్తిసైతము గోల్పోయి జడులైపోవుదురు. ఇట్టి జడులు
పౌరులుగా పరిగణింపబడుటకు తగనివారగుదురు.

ఒక రాజ్యము తన అధికారమునుగూర్చి చేయనిచ్చు
విమర్శనమే దానికి తన ప్రజలపైన నిజముగాగల పలుకుబడికిని
ప్రభావమునకును గల నిదర్శనము. వాక్స్వాతంత్ర్య మనగా
అన్ని సామాన్య విషయములను గూర్చియు ఒకని యభిప్రాయ
మును వెలిబుచ్చుటకుగల స్వేచ్ఛ. అనగా ప్రభుత్వాధికార
ములో సెన్సారుషిప్పు (కంటికి శోధన - నిషేధాజ్ఞలు) లేక
పోవుట. నే నెవ్వరినైనను దూషించినచో దూషింపబడిన
వాడు న్యాయసభలో అభియోగము జేసికొని న్యాయము
పొందవలెను. వాక్స్వాతంత్ర్యముతో పాటు పలువురు కలిసి
వ్యవహరించుటకు బహిరంగ సభలో సమావేశమగుటకు గల
హక్కుగూడ చేరియుండును. ఆధునిక రాజ్యములందొక వ్యక్తి
తనతోడి మనుష్యులతో కలిసి తన యభిప్రాయములను చర్చిం
చుటకు హక్కు కలిగియున్నాడు. ఇతరులెవ్వరో అక్రమచర్య
లకు గడంగుదురను కారణమున శాంతియుతమగు నొక ప్రజాభి
ప్రాయ ప్రకటనము నిషేధము కాజాలదని సామాన్య ధర్మము
స్థిరపడియున్నది.

ప్రతి ప్రభుత్వమును తన స్థిరత్వము కొరకు స్వసంరక్ష
ణముకొరకు తగుచర్య తీసికొనవలసి యున్నదనుమాట నిజమే.

ఆ ప్రభుత్వాధికారమును ఆ క్షణమున ప్రత్యక్షముగా హరింప జూచు సంఘమును నాశనము చేయుటకు దానికి హక్కు కలదు. కాని తనచర్య సరియైనదని తానే తీర్మానించుట కే ప్రభుత్వమునకును కేవల పరిపాలనాధికారరీత్యా హక్కు లేదు. ప్రతి ప్రభుత్వమును ధర్మశాస్త్ర విధుల ప్రకారము సాక్ష్యమును జూపి ఋజువునకు బద్ధత జెందితీరవలసినదే.

ఒక సంఘము నింక నిలువనిచ్చినచో శాస్త్ర విరుద్ధము లగు అక్రమ కార్యములు జరిగితీరుననుట నిశ్చయమని అనగా కేవలము అభిప్రాయ ప్రకటనముల వలననే కలుగవచ్చునని యూహించు చర్యలుగాక ఋజువు చేయుటకు వీలుగల కార్య కరణములు చర్యలవలని ప్రమాదమునను కార్యనిర్వాహక వర్గము వారొక న్యాయసభవారికి సహేతుకముగా నచ్చజెప్పి యొరుకబరుపవలెను.

క్లిష్టములగు రాజకీయ పరిస్థితులలో న్యాయసభవారి అభయ (రక్షణ) మనునది చాల స్వల్పరక్షణమే యైనను, అది కొంతవరకైన వ్యక్తి స్వాతంత్ర్యమును రక్షింపగల దనుట నిశ్చయము. టాల్‌స్టాయి మహాఋషియొక్క అహింసాత్మక విప్లవవాదులగు అరాజక సంఘమువారు మందుగుండు సామాను లతో బలప్రయోగము జేయు కుట్రలు పన్నుచున్నారని ఏ పిచ్చి మంత్రియు తొందరపడి చర్యగైకొనకుండ నీన్యాయసభారక్షణము కాపాడునని మా యభిప్రాయము. రాజ్యమునకు నిజ మగు భయము కలిగిననే చర్యతీసికొన ననుజ్ఞ నీయవలెనుగాని లేనిచో అనుజ్ఞ నీయరాదు. ఈ సిద్ధాంతమెల్ల యుద్ధసమ

యములందును, విప్లవసమయములందును సహింపవని కొందరి యూహ. బలప్రయోగము ఆలోచనా శక్తిని నశింపజేయును. విప్లవమనగనే ప్రస్తుతపు హక్కులు తారుమారైనవన్నమాట.

న్యాయసభా రక్షణముగల ఆంగ్ల రాజ్యాంగ విధానమున శాసనవిధుల నుల్లంఘించినవారలకు శిక్షయు నష్టపరిహారమునుగూడ విధింపబడి యున్నవి. సైనికధర్మ విధులపైన సివిలు కోర్టులకు పరిపూర్ణాధికారమున్న గాని మార్షలులా చర్యలందు వ్యక్తులకు న్యాయము దొరకదు. కార్యనిర్వాహకవర్గమువారి చర్యలను వేయికన్నులతో కనిపెట్టిచూచు స్వతంత్రన్యాయ పరిపాలకవర్గము వారున్ననే ప్రాణావసర సమయమున రాజ్యాంగ ధర్మములనుకూడ అణచివేసి నిరంకుశముగా ప్రవర్తించు కార్యనిర్వాహకవర్గము కొంతకాకపోయిన కొంతవరకైన ప్రజల హక్కులను బాధ్యతలను గమనించుట కవకాశముండును.

నిజముగా యుద్ధసమయములందు, క్లిష్ట రాజకీయ పరిస్థితులందుగూడ పౌరునికి వాక్స్వాతంత్ర్య ముండితీరవలెను. ఆ యుద్ధము న్యాయమైనదేయని పౌరునికి తోచినచో నతడు దానిని సమర్థించును. అది యన్యాయమని తోచినచో దానినతడు నిరసించును. తన పౌరుల యభిప్రాయమును సరకుసేయక ప్రవర్తించుటకే పరిపాలకవర్గమునకును హక్కులేదు. ప్రతికూలాభిప్రాయము వెల్లడించినచో యుద్ధమును జయప్రదముగా జరుపుటకు వీలుండదని సాకుచెప్పుట భావ్యముకాదు. పరిపాలకవర్గమువారి చర్యలను విమర్శించుట యుద్ధసమయము

లందు మరియు ముఖ్యకార్యము. జాతియొక్క విపత్సమయము నందు పౌరులు తమ యుక్తాయుక్త వివేచన జ్ఞానము నుపయోగించుట మరియు నావశ్యకము. ప్రజాభిప్రాయమును ప్రభుత్వ మెంతగా మన్నించునో ఆ ప్రభుత్వమంత ప్రజాహితైకమైనదని యెరుగనచ్చును.

ధర్మముపైన హక్కులపైన నిర్మింపబడిన రాజ్యాంగ మునందు పౌరునికి సంపూర్ణమగు న్యాయ విధికృతరక్షణము లుండుట సమంజసము. అతనిపై నేదైన నేరము మోపబడి నచో నతని నిర్దోషిత్వము వెల్లడియగుటకు పరిపూర్ణావకాశముగల విచారణ జరుగుట కతనికి హక్కు కలిగి యుండవలెను. అందువలన విచారణ లేకుండగ నతడు నిర్బంధింప బడరాదు. అక్రమ నిర్బంధమునుండి వదలించి నేరముయొక్క న్యాయాన్యాయములను వ్యక్తి సంరక్షణము చేయు "హేబియస్ కార్పస్" హక్కు ప్రతి పౌరునియొక్క ప్రధానమగు హక్కుగా నున్నది.

రాజ్యమునందలి న్యాయసభ లందరికిని సులభసాధ్యము లైన వ్యవహారములను నిష్పక్షపాతముగను తారతమ్య రహిత ముగను శీఘ్రముగను పరిష్కరించి న్యాయమును ప్రసాదించు నట్టివిగా నుండవలయును. ప్రభుత్వము సైతము తక్కిన సామాన్య కక్షిదారులతో పాటు న్యాయస్థానము నెదుట నిలిచి తన వాదనయొక్క నిజానిజములు ఋజువుచేసుకొనవలసినదే. ప్రభుత్వము పేరున జరిగినంత మాత్రమున ఏకార్యమును న్యాయ విచారణకు అతీతము కాజాలదు. ఏ అక్రమ కార్య

మును సక్రమము కాజాలదు. ధర్మసభ నెదుట అందరును సమానులే. ప్రతి వ్యక్తియు, ప్రతి సంస్థయు, ప్రతి నేరమును, ప్రతి కార్యమును, ఎంత గొప్పదైనను, ఎంత కొద్దిదైనను ధర్మమునకు లొంగితీరవలసిందే. ఇదియే సరియైన ధర్మవిధి.

ఇందుకొరకు గావలసిన ప్రధాన లక్షణములు రెండు. మొదటిది న్యాయ పరిపాలక వర్గము (న్యాయాధిపతులు) నిజముగా స్వతంత్రులై యుండవలెను. రెండవ లక్షణము ప్రభుత్వపరిపాలనము, న్యాయ పరిపాలనము, నొకే యుద్యోగ వర్గము చేతులతో కలిసియుండరాదు.

తన అంతరాత్మకు తప్ప న్యాయ పరిపాలకవర్గ మితరుల కెవ్వరికిని ఉత్తరవాది కాకూడదు. వీరి చర్యలు తమ కనిష్టముగ నున్నంత మాత్రమున న్యాయపరిపాలకము వారిని తొలగించుటకు ప్రభుత్వవర్గమువారి కధికారముండరాదు. పరిపాలనము చేయువారిచేతనే న్యాయసిద్ధాంతాచరణాధికారము గూడ నిలిపియుంచు పద్ధతి చరిత్రరీత్యా ప్రజా పీడకుల నాశ్రయించి యున్నదను సంగతి జగద్విదితము.

# ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం

ఇండియాలో ప్రివెన్టివ్ డిటెన్షన్ * గురించి శ్రీ డేవిడ్ హెచ్. బెయిలీ వ్రాసిన ఈ గ్రంథమునందు ఎనిమిది ప్రకరణములు రెండు అనుబంధములు నున్నవి. మొదటి ప్రకరణము నివారక నిరోధశాసన (ప్రివెన్టివ్ డిటెన్షన్) నిబంధనలను వివరించుచున్నది. రెండవ ప్రకరణమున 1950 లో పార్లమెంటు వారి శాసనము చేయుటలోను 1993 వరకు పొడిగించుటలోను జరిగిన చర్యలు. మూడవ ప్రకరణములో శాసనము అమలు జరిగిన రీతి, నాల్గవ ప్రకరణమున శాసనమునుగూర్చి న్యాయస్థానముల తీర్పులు, ఐదవ ప్రకరణమున నివారక నిరోధ శాసనము, రాజకీయ దృక్పథము, ఆరవ ప్రకరణమున దాని సమర్థనము, ఏడవ ప్రకరణమున నివారక నిరోధము, వ్యక్తి స్వాతంత్ర్యము, ఎనిమిదవ ప్రకరణమున ప్రజాప్రభుత్వ సిద్ధాంతాలకు శాసనం కలిగించు చిక్కులు చర్చించిరి. మొదటి అనుబంధమున నివారక నిరోధ శాసనమును రెండవ యనుబంధమున భారత రాజ్యాంగములోని 19 వ ఆర్టికలు నుంచి 22 వ ఆర్టికలు వరకు ముద్రింపబడినవి.

స్వతంత్ర భారత రాజ్యాంగం 1950 వ సంవత్సరం జనవరి 26 వ తేదీన అమలులోనికి వచ్చినది. దానినిబట్టి ప్రతి పౌరునికి వాక్స్వాతంత్ర్యము, భారత దేశమంతయూ స్వేచ్ఛగా తిరుగుటకు, ఎక్కడనైన నుండుటకు, ఆస్తి సంపాదించుటకు, ఏ వృత్తినైన చేసికొనుటకు హక్కు లొసగబడి యున్నవి.

ఇంతేకాదు. ఏ పౌరుడును న్యాయశాస్త్ర ప్రకారము ఏదో యొక నేరమునకు తప్ప దండింపబడరాదు. తనపైన వచ్చిన అభియోగమునకు తాను సాక్ష్య మొసగునట్లు నిర్బంధింపబడరాదు. న్యాయశాస్త్ర ప్రక్రియానుసారముగ తప్ప ఏ వ్యక్తియొక్క ప్రాణము, వ్యక్తి స్వాతంత్ర్యము తీయుటకు వీలులేదు. ఈ హక్కులు రాజ్యాంగములోని 19-21 ఆర్టికిలు లందు వివరింపబడినవి.

ఏ వ్యక్తినైన అరెస్టుచేసి పట్టుకొనివచ్చు డతనికి వీలై నంత త్వరలో అరెస్టు కారణములను తెల్పనిది నిర్బంధమున నుంచరాదని, అతనికిచ్చవచ్చిన న్యాయవాదివలన సలహాపొంది వాదించుట కవకాశము లేకుండ చేయరాదని, అట్లు అరెస్టు చేయబడి నిర్బంధమున నుంచబడిన వ్యక్తిని 24 గంటలలో సమీపమునగల మేజిస్ట్రేటు నెదుటకు తీసుకొనివెళ్ళి హాజరు పరచి అతనివలన ఉత్తరువులు పొందినగాని అటు తర్వాత నత నిని నిర్బంధించి యుంచరాదనియు 22 వ ఆర్టికలు విధించినది. అయితే దానిలోనే నివారక నిరోధము నిమిత్తము పట్టుకొని నిర్బంధించి యుంచిన వ్యక్తికి పై నిబంధనలు వర్తింపవని, అట్టి వ్యక్తి విషయములో పాటించవలసిన నిబంధనలను వేరుగా వివరించినది. నివారక నిర్బంధము కొరకు భారత ప్రభుత్వం ఏ వ్యక్తిని మూడు నెలలకన్న హెచ్చుకాలం నిర్బంధింపరాదని, అయితే హైకోర్టు జడ్జిలుగ నుండిన లేక ఇప్పుడు ఉన్నవారు గల సలహాబోర్డువారు తగు కారణములున్నవని రిపోర్టుచేసిన నచో పార్లమెంటువారు శాసనముద్వారా నిర్ణయించిన పరిమితి కాలమువరకు నిర్బంధింప వచ్చునని, ఏ వ్యక్తినైన అట్లు

నిరోధింపబడిన వ్యక్తికి నిరోధ కారణములను సాధ్యమైనంత త్వరగా తెలియజేయవలెనని, దానినిగూర్చి అతడేదైనా నివే దించుటకు తగు అవకాశ మొసగవలెనని బహిరంగ పరచుట వలన ప్రజాశ్రేయస్సునకు భంగము కలిగించు సంగతులు చెప్ప నక్కరలేదనియు విధించినది. మూడు నెలలకన్న హెచ్చు కాలము నిరోధమున నుంచుటకుగల పరిస్థితులకు పరిమితి కాల మును అడ్వైజరీబోర్డులను సలహా సంఘంవారు అనుసరింపవల సిన ప్రక్రియా విధానమునుగూర్చి పార్లమెంటు శాసనమును చేయవచ్చునని విధించినది.

## 1950 నాటి శాసనం

భారతదేశపు పరిస్థితులను బట్టి రాజ్యాంగము అమలు లోనికి వచ్చిన కొన్ని గంటలలోనే అధ్యక్షులైన రాజేంద్ర ప్రసాద్ గారు అంతకు ముందుండిన నివారక నిరోధము గడువు కాలము పొడిగింపుచేయు ఉత్తరువును జారీచేసిరి. ఈ ఉత్త రువు చెల్లదని హైకోర్టులు తీర్మానించెను. అందువలన అదివరకు రాష్ట్రములందు నివారక నిరోధముక్రింద నిర్బంధింపబడినవారు విడుదల చేయబడు పరిస్థితి యేర్పడినది. జాతీయోద్యమములకు పుట్టి నిల్లగు కలకత్తాలో 500 మంది నిర్బంధితులు పెట్టుకొనిన పిటీ షనులు 1950 ఫిబ్రవరి 26వ తేదీన విచారణ జరుగును. అందు వలన భారత ప్రభుత్వమువారు నివారక నిరోధ శాసనమును 1950 ఫిబ్రవరి 25 వ తేదీన పార్లమెంటులో అత్యావసరముగా ప్రవేశపెట్టి చర్చింపజేసి ఆ రోజుననే శాసనముగ చేయించిరి.

ఈ శాసనమునుబట్టి భారత దేశ రక్షణకు, విదేశములతోడి సంబంధములకు, భారత దేశ భద్రతకు, రాష్ట్రముల భద్రతకు, ప్రజల క్రమవ్యవస్థ (పబ్లిక ఆర్డరు) కు, ప్రజల కావశ్యకములగు సరఫరాల, సేవల నిర్వహణకు భంగకరముగా ఏ వ్యక్తిగాని ప్రవర్తింపకుండ నివారించుట ఆవశ్యకమని, ఏ విజాతీయుని విషయమైగాని చర్య ఆవశ్యకమని కేంద్ర ప్రభుత్వముగాని, రాష్ట్ర ప్రభుత్వముగాని సంతృప్తి చెందినచో ఆవ్యక్తిని నిరోధించుచు నొక ఉత్తర్వు చేయువచ్చును. ప్రభుత్వము వలన అధికృతులైన జిల్లా మేజిస్ట్రేటుగాని బొంబాయి, కలకత్తా, మద్రాసు, హైదరాబాదు నగరముల పోలీసు కమీషనర్లుగాని ఈ అధికారమును చెలాయింపవచ్చును. ఆ వ్యక్తిని నిరోధించుచు ఉత్తర్వు చేసిన 12 దినములలో రాష్ట్రప్రభుత్వము దాని నామోదింపవలెను. లేనిచో అది రద్దగును. అందువలన ఆ ఉత్తర్వు చేసిన అధికారి వెంటనే ఉత్తర్వు జారీచేసినసంగతిని, ఉత్తర్వు చేయుట కాధారమయిన సంగతులను ప్రభుత్వమునకు తెలుపవలెను. అంతట రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వము దానిని ఖాయపరుపవచ్చును లేదా రద్దుపరుపవచ్చును.

నిరోధిత వ్యక్తికి నిరోధింపబడిన తేదీనుంచి ఐదు రోజులు దాటకుండా ఆ ఉత్తరువున కాధారమైన సంగతులను తెలుపవలెను. మరియు ఆ ఉత్తరువునకు ఆక్షేపణలను చెప్పుకొనుట కతనికి సాధ్యమైనంత సత్వరావకాశ మొసగవలెను. అయితే ప్రజా క్షేమమునకు భంగకరమని తోచిన సంగతులను బయల్పరుప నక్కరలేదు. మూడు నెలలకన్న హెచ్చుకాలము నిరోధింపబడు వ్యక్తుల విషయములో నిరోధించిన తేది తరు

వాత 30 దినములలో నిరోధపుటుత్తర్వును, నిరోధిత వ్యక్తి చేసికొను నివేదనను, నిరోధపు టుత్తరువు చేసిన అధికారి నివేదికను అడ్వయిజరీబోర్డు అను సలహా సంఘమువారికి సమర్పింపవలెను. హైకోర్టు న్యాయాధిపతులుగ నున్నవారినిగాని, ఉండినవారినిగాని, ఉండతగిన అర్హతలుగలవారినిగాని ఆ సలహా సంఘమున నియమింపవలెను.

నిరోధిత వ్యక్తిని నిరోధించుటకు తగిన కారణము లేదని బోర్డువారభిప్రాయ పడినచో అతనిని తత్క్షణము విడుదల చేయవలెను. తగిన కారణమున్నదని వారభిప్రాయపడినచో ప్రభుత్వమువారు తమకు తోచినట్లుగా ఆ ఉత్తరువును ఖాయపరుపవచ్చును, మార్చవచ్చును, రద్దుచేయవచ్చును. ఈ శాసనముక్రింద నొకవ్యక్తి నొక సంవత్సరంపరకు నిరోధింపవచ్చును. బోర్డువారు నిరోధం తేదీనుంచి మూడు నెలలలోగా తమ తీర్మానం ఒసగవలెను.

1950 లోనే ఏ. కె. గోపాలన్ అను నిర్బంధితుడు పెట్టుకొనిన పిటిషన్ సుప్రీముకోర్టులో విచారణకు వచ్చినప్పుడా న్యాయస్థానమువారు భారత రాజ్యాంగ నిబంధనలకీ శాసనము విరుద్ధముగ లేదని తీర్మానించినది.

## తప్పనిసరి పరిస్థితులు

భారతదేశ స్వాతంత్ర్యము కొరకు పాటుపడి బ్రిటిష్ ప్రభుత్వమువారివలన నిర్బంధింపబడి బాధలనందిన దేశ నాయకులలో అగ్రగణ్యులైన జవహార్‌లాల్ నెహ్రూగారు ప్రధాన

మంత్రిగాను, వల్లభాయి పటేలుగారు స్వదేశ వ్యవహారముల మంత్రిగా నుండగా స్వతంత్ర భారతదేశమునందలి పరిస్థితులనుబట్టి ఇటువంటి శాసనము చేయుట అవసరమని వారికి తోచినందువలననే వారీశాసనమును పార్లమెంటులో ప్రవేశ పెట్టిరి. ప్రజా ప్రతినిధులలో బహు సంఖ్యాకులు హర్షించి దీనిని శాసనముగా చేసిరి

"ఇది ఏ రాజకీయ పక్షమువారిని దృష్టిలో నుంచుకొని చేసిన శాసనము కాదు. సంసర్గ మార్గములను అరికట్టి కల్లోలములు కలిగించి ప్రభుభక్తిని రూపుమాపి న్యాయ శాస్త్రానుసారముగ పరిపాలన జరుగకుండ విధ్వంసము చేయు వారిని నిరోధించుటకే ఈ శాసనము చేయబడుచున్నది. దేశములోని లక్షలకొలది ప్రజల స్వాతంత్ర్యమునకు భంగకరముగ దుశ్చర్యలు చేయగల ఏ కొలది మందినో నిర్బంధించు విషయమై సానుభూతి చూపవలసిన పనిలేదని చెప్పి, అప్పుడు తెలంగాణాలో కమ్యూనిష్టులు చేసిన ఘోరకృత్యములను వివరించి ఈ శాసనము చేయుట ఆవశ్యకమని పటేలుగారనిరి. తాము దాస్యస్య విధానములను విడనాడి శాసనబద్ధ ఆందోళన విధానము నవలంబింతుమని కమ్యూనిష్టులు చేసిన ప్రకటన ఆటుతరువాత ఎనిమిదేళ్ళకు చేయబడినది. అందువలన నీ శాసనమును వీరు ప్రతిఘటించుటలో సారము లేకుండెను. పార్లమెంటులోను ఇతర పక్షములవారికి ఆనాడు దేశములో శాంతి భద్రతల పరిస్థితి బాగాలేదని తోచినందువలనను, సామాన్య క్రిమినల్ న్యాయశాస్త్ర విధులనుబట్టి విచారించి శిక్షింప వీలు లేని వ్యక్తుల విషయమున నిట్టి నివారక నిరోధ శాసనము అవ

సగమేయని తీర్మానించినను పార్లమెంటువారి శాసనమును చేయునట్లు పటేలుగారు ప్రోత్సహించ గలిగిరి. శాసనము మొదట 1951 ఏప్రిల్ 1 వరకు అమలులో నుండునట్లు శాసించిరిగాని ఇది యుపయోగకరముగ నుండినట్లు పార్లమెంటుకు తోచినందున తరువాత చాలాసార్లు పొడిగింపబడి 1963 వరకు అమలు జరిగెను. అటుతరువాతకూడా పొడిగింపబడినది.

ప్రజా ప్రభుత్వము శైశవావస్థలో నున్నది. దీనిని కాపాడవలెను. న్యాయ శాసనములను తృణీకరించు దౌర్జన్యములు చేయువారు బందిపోటువారు, చీకటిబజారువారు విజృంభించినారు. ఇతర దేశములవలెగాక మన దేశములో ఏవిధము చేతనైనను ప్రజా ప్రభుత్వమును తిరుగదోడదలచిన ఒక రాజకీయ పక్షమున్నది. మన దేశ ప్రజలలో జాతి మత కుల భేదములు మొదలైన తీవ్ర విభేద శక్తులున్నవి. వీనికి చిచ్చుముట్టింపగల వారున్నారు అని ప్రభుత్వ పక్షమున పార్లమెంటులో చెప్పిరి.

ఈ శాసనము నమలుచేయుటలో ప్రభుత్వము జాగ్రత్తను చూపినట్లు విదితమయ్యెను. 1950 నుండి 1960 వరకు నిర్బంధింపబడినవారి సంఖ్య తగ్గినది. ఈ శాసనముండుటవలన దీనిక్రింద నిరోధింపబడుదుమను భయ మున్నందుననే పరిస్థితులు మెరుగైనట్లు కనబడినవి. శాసన నిబంధనలు సరిగా పాటించబడలేదని, రాజ్యాంగ స్వాతంత్ర్యములు సంకుచిత పరుపబడినవని, చట్టము దుర్దేశ్యముతో ప్రయోగింపబడినదని నిర్బంధితులు న్యాయస్థానమునందు అభ్యర్థన పిటిషన్‌లు పెట్టు

కొనుటకు న్యాయస్థానములు వానిని విని తీర్మానించుటకు వీలుండెను. సుప్రీముకోర్టు ప్రభుత్వమున కొక అంకుశంవలె పని చేసెను.

ఈ శాసనమును విమర్శించువారు పాశ్చాత్యదేశ ప్రజా ప్రభుత్వాలవారు గైకొను చర్యలతో పోల్చిచూసు) టే పరిపాటియైనది. కాని మనదేశ పరిస్థితులకును, ఆ దేశ పరిస్థితులకును పోలికలేదు. రాజ్యాంగబద్ధమైన ప్రధాన ప్రయోజనము, ప్రజారక్షణము, శాంతి భద్రతలు అని పాశ్చాత్యదేశ ప్రజ లెరుగుదురు. ప్రభుత్వశాసనము క్రమవ్యవస్థ(Law and Order) దేశాభివృద్ధి కత్యంతావశ్యకము లనియు ఎరుగుదురు. అందువలన ప్రజల ప్రాణరక్షణము, ఆస్తి రక్షణము ప్రభుత్వమునకు, ఆర్థికాభివృద్ధికి ఆవశ్యకములు. పాశ్చాత్య దేశములందు ప్రభుత్వ శాసనమునకు క్రమ వ్యవస్థకు భంగము లేని పరిస్థితియే సర్వసాధారణమై వున్నందున అక్కడి ప్రజలు దానిని కాపాడవలసిన పరిస్థితినిగూర్చి తలంపవలసిన అవసరమే కనబడదు. ఎప్పుడో ఒకప్పుడుగాని ఇగ్లండులోను, అమెరికాలోను దౌర్జన్యములు జరుగవు. దౌర్జన్యములు, రక్తపాతము జరిగినప్పుడు పాశ్చాత్య దేశములందలి జనసామాన్యమునకు రోత కలుగుచుండును.

ఏ విషయముగూర్చి అయినను అసమ్మతి చూపుటకు ఆందోళనము చేయుటలో ఎంతవరకు వెళ్ళవచ్చునను విషయంలో అక్కడి ప్రజలలో కొన్ని సామాన్య భావములున్నవి. రాజకీయ పక్షములు సరిహద్దును మీరి చరించినచో ప్రజ లేవగించుకొందురు. వారిని బహిరంగముగ గర్హింతురు. ఎన్నిక

లంకు వారినోడింతురు. అక్కడి రాజకీయ పక్షములవారి కాధయమున్నది.

## రాజకీయవాదుల ప్రాతికూల్యం

రాజకీయములందు ప్రభుత్వ చర్యలపట్ల అసమ్మతిని తెలుపుటకు ఆందోళనము చేయుటనుగూర్చి ఇట్టి భావములు లేక, శాసనముల నుల్లంఘించి నేరములు చేయువారిని జనసామాన్యము అసహ్యించుకొనుభావము లేక, వారిని మహావీరుడుగను, ధైర్యశాలురుగను, త్యాగమూర్తులుగను తలచి వారిని కీర్తించుపరిస్థితి సంభవించినచో ప్రభుత్వమును సమర్థించువారు, గర్హించువారు అను రెండు పక్షములు బయలుదేరును. దేశ రక్షణమునకు ప్రజారక్షణమునకు సంబంధించిన విషయములను గూర్చిన చర్యలపట్లనే అట్టి అభిప్రాయ భేదము కలిగినచో ప్రభుత్వమునకు చాలా చిక్కులు కలుగును. ప్రభుత్వ శాసనము క్రమ వ్యవస్థను కాపాడుటకు సాధన సామగ్రిని చేకూర్చుకొనుటతో పాటు జనసామాన్యమును దానికి సుముఖులుగా చేయు సమస్య ఒకటికూడా ఏర్పడుచుండును. అనగా ఇది ఒక రాజకీయ సమస్య అగును. జాతి, మత, కుల, భేదములు ఆదర్శ భేదములుగల భారతీయ జన సామాన్యములోని వివిధ వర్గముల వారి నే ముఖ్య విషయమును గూర్చియైనను సుముఖులుగ చేయుట సాధ్యముకాదు.

దురదృష్టవశమున భారతదేశము నేలిన నిరంకుశ విజాతీయ బ్రిటిష్ ప్రభుత్వమువారి శాసనమును వారేర్పరచిన క్రమ

వ్యవస్థలో శాంతి భద్రతలను కాపాడుటకు వారేవిధానము నవ లంబించిరో ఆ విధానములనే స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వం కూడా అవలంబింపవలసివచ్చెను. పూర్వము బ్రిటిషు ప్రభుత్వ మును కాంగ్రెసు వారెలా విమర్శించిరో ఇప్పుడు కాంగ్రెస్ ప్రభుత్వమును ప్రతిపక్షమువారలా విమర్శింపసాగిరి. బ్రిటిషు ప్రభుత్వకాలమున దేశస్వాతంత్ర్యముకొరకు విజాతీయ ప్రభుత్వ శాసనమును ధిక్కరించి దౌర్జన్యములొనగావించి ప్రాణములర్పిం చిన దారుణ వాదులను ప్రభుత్వమువా రరాజకులుగా, ప్రజా నాయకులు ప్రజలు మహావీరులుగ గౌరవించుచుండిరి. గాంధీ మహాత్ముని శాసనోల్లంఘనమున చెరకేగిన సత్యాగ్రహులను త్యాగమూర్తులుగ గౌరవించుచుండిరి.

ప్రభుత్వమునకు వ్యతిరేకంగా సామూహికాందోళనము జరిగినప్పుడు దేశంలో దౌర్జన్యములు, రక్తపాతము కలిగినప్పు డవి ప్రభుత్వమువారి అత్యాచారములవలన, తీవ్ర నిర్బంధ విధానము వలననే కలిగినవని ఆనాటి రాజకీయనాయకు లను చుండిరి. స్వతంత్ర భారత ప్రజా ప్రభుత్వమువారు శాంతి భద్ర తల కొరకు చర్యలు తీసికొననప్పుడు కూడా దేశములో జరిగిన దౌర్జన్యములు రక్తపాతమునకు కాంగ్రెసు పక్షమువారును, వారు నడుపుచున్న ప్రభుత్వమువారును బాధ్యులని కమ్యూని స్టులు మొదలగు ప్రతిపక్షులును, స్వతంత్ర సభ్యులును కూడా పైనచెప్పిన విధముగా ప్రభుత్వమును నిందించుట జరిగినది. శాసనమును తీవ్రముగ ఖండించి దుర్భాషనాడిరి. వ్యక్తుల ప్రాతిపదిక స్వాతంత్ర్యములను ప్రభుత్వమువారు అనగ్రదొక్క సచో, వారి యుద్యోగులు న్యాయముగ ప్రవర్తింపనిచో

ప్రధానమంత్రి నెహ్రూగారు నిరసించిన వీధి ప్రదర్శనములు మొదలైనవి జరిగితీరుతవని జయప్రకాశ్ నారాయణగారనిరి.

విజాతీయులగు బ్రిటిషువారేలిన కాలమునాటి పరిస్థితులును, విధానములును స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వ కాలమున వర్తింపవని, భారతదేశ ప్రజలు, ప్రజాప్రభుత్వ విధానముల నలవరచుకొనవలెనని, రాజకీయ పక్షములు దౌర్జన్యములకు దారితీయు సామూహికాందోళన నిరసన విధాన పరికరములు విడనాడవలెనని నెహ్రూగారుద్ఘాటించిరి. ఇంతేకాదు. చీటికి మాటికి సత్యాగ్రహము చేయుట, ప్రాయోపవేశము చేయుటకూడా నిరసించిరి. ఈ భారతదేశమునందు గాంధీ మహాత్ముడొక్కడుతప్ప సత్యాగ్రహులే లేరని, ఇప్పుడు శాసనముల నుల్లంఘించి తలబ్రద్దలు గొట్టువారెల్లరు సత్యాగ్రహులుగనే చెలామణి అగుచున్నారని, ఇట్టి మాటలవల్ల ప్రయోజనము లేదని, ఎవ్వరైన తనతల బ్రద్దలుగొట్టదలచినచో దానిని వారు నివారించగలిగిన దో అట్లు చేసితీరెదనని నెహ్రూగారనిరి.

రాజకీయ పక్షములవారి శాసనమును గర్హించుచున్నారేగాని, ప్రజానీకము అన్ని వ్యవహారములందువలెనే ఈ విషయమునందు ఆసక్తి గైకొనుట లేదని, ఇంగ్లాండ్ అమెరికా దేశములందువలె తాత్కాలికముగా అత్యవసర పరిస్థితులు దౌర్జన్యములు కలిగి చల్లారుటగాక ఈ దేశములో ప్రభుత్వ శాసనమునకు, క్రమ వ్యవస్థకు భంగము కలిగించి దౌర్జన్యములు కలుగు పరిస్థితులు, కారణములు, స్థిరముగా నున్నవని,

త్వరితచర్య తీసుకొని వాని సరికట్టుటకు, సామాన్య న్యాయ శాస్త్ర విధులు చాలవని, అందువలన నివారక నిరోధక శాసన మావశ్యక మేయని గ్రంథక ర్తగా రభిప్రాయపడినారు. మన దేశ ములో ఏ విషయములో అయినను సామూహిక ఆందోళనము జరుగుటకు, దౌర్జన్యములు జరుగుటకు అవకాశమున్న దను సంగతి ఇటీవల మద్రాసులో జరిగిన హిందీ వ్యతిరేకాందోళ నము వలన రూఢియగుచున్నది.

ఇదివరకీ శాసనమునుగూర్చి సుప్రీంకోర్టులో జరిగిన చర్చలవలనను, ఇంతవరకు శాసనమును అమలుచేయుటలో కలిగిన అనుభవము వలనను ఈ శాసనముక్రింద జారీచేయబడు ఉత్తరువులు సముచితములైనవేయని పరిశీలించుటకు, అడ్వైయి జరీబోర్డుకు బదులు సుప్రీముకోర్టునకే అధికారమిచ్చి కొన్ని మార్పులతో ఈ శాసనమును స్థిరముగానే శాసించినచో బాగుండునని గ్రంథకర్తగారి యూహ.

ఇంగ్లాండులోను, అమెరికాలోను అత్యవసర పరిస్థితులు చాలా సకృత్తుగా తటస్థించును. అప్పుడట్టి శాసనమును చేయు దురు. భారతదేశమున జాతి మత కులభేదములు, వివిధ భాషలు, వివిధ ఆదర్శములుగల జనసంఘములున్నవి. వారిలో మనోవ్యథ, నిరాశా భావము, ఆగ్రహము కలుగుటకు హెచ్చు అవకాశములున్నవి. తమ బాధలను ప్రజాప్రాతినిధ్య సంస్థలద్వారా న్యాయస్థానముద్వారా తీర్చుకొను పద్ధతినిగాక సామూహికాందోళనము చేయుట వారికి అలవాటైనది. పరి స్థితి స్థిరముగనే వుండును. గనుక దీని సరికట్టుటకు స్థిరమైన నివారక నిరోధక మవసరము.

భారతదేశము నేటి ప్రజాప్రభుత్వము తమ స్వంత ప్రభుత్వమని, దీని ద్వారా తమ కోర్కెలు తీర్చుకొనవచ్చునను భావము ప్రజలలో ఏర్పడలేదు. శాంతి భద్రతలను కాపాడుట కేర్పడిన పోలీసువారిపైనను ప్రజలకు నమ్మకములేదు. పూర్వమువలెనే పోలీసువారు అనుమానముపై నిర్బంధించిన వారిని హింసించిన నిదర్శనములున్నవి. ఈ రాజ్యాంగము ప్రజలు నిర్మించినదికాదు. ప్రభుత్వము వహించిన ప్రజానాయకులే నిర్మించియున్నారు. అందువలన ఈ రాజ్యాంగము ప్రకారము ప్రభుత్వమువారు తాము నడచిచూపి ప్రజలను నడిపింపవలెను. ప్రభుత్వమువారు ప్రతి విషయమునను తమ చర్యలు సమర్థించుకొనవలసి వచ్చుచుండును. ప్రజలు తమ చర్యలను గర్హించి సామూహికాందోళనము చేసినప్పుడాత్మ రక్షణము కొరకు కఠిన చర్యలు తీసుకొనవలసి వచ్చును. ఆ సందర్భములో ప్రజాప్రభుత్వము స్వరూపమునే మార్చగల తమ అధికారం చలాయించవచ్చును. పైన చెప్పిన కారణములవలన ప్రభుత్వాధికారము ఇలా విపరీత పరిణామము చెందకుండా నివారించుటకు మనదేశ ప్రజాభిప్రాయము సమర్థము కాదు.

పైన చెప్పిన కారణములవలన అటు ప్రభుత్వాధికారముల చెలాయింపులోని ఔచిత్యిని, ఇటు ప్రజల స్వాతంత్ర్యముల రక్షణమును గమనించి రాజ్యాంగ విధుల ప్రకారము జరుగునట్లు కాపాడుటకు మన రాజ్యాంగమున నెలకొల్పబడిన స్వతంత్ర న్యాయాధికార సంస్థయగు సుప్రీముకోర్టు చాలా ఉపకరింప గలదని, దీనివలన ప్రజలకు ప్రజాప్రభుత్వముపైన విశ్వాసము కుదురగలదని గ్రంథకర్తగారు సూచించిరి.

ఇంగ్లాండు దేశ పార్లమెంటు సర్వాధికారముగల ప్రజా ప్రభుత్వ సంస్థయైనను అక్కడి ప్రజాభిప్రాయమునకు లోబడి యుండును. సామాన్య న్యాయశాస్త్రమే ప్రజలకు రక్షణగా నున్నది. అమెరికాలో లిఖిత రాజ్యాంగమే పరమ ప్రమాణము, అందొక దానినొకటి బంధించి హద్దులో నుంచ గల అధికారములు, ప్రజల ప్రాతిపదిక స్వత్వములు వివరింప బడి వానిని కాపాడుటకు స్వతంత్ర న్యాయాధికారముల సంస్థ యేర్పరుపబడినది. ఇలా ఇగ్లాండు, అమెరికాలలోని ప్రజలు ప్రజాప్రభుత్వ లాభముల నెరిగిన ప్రాజ్ఞులైనను కొన్ని ప్రత్యక్ష పరీక్ష లేర్పరుపబడియున్నవి.

అధికారములు సరిహద్దుగున్నట్లు చూచి ప్రజల స్వాతంత్ర్యములను కాపాడుటకు ఇంగ్లాండు, అమెరికా దేశములలో కన్న హెచ్చుగా భారతదేశము తన లిఖిత రాజ్యాంగముపైనను, స్వతంత్ర న్యాయాధికార సంస్థయగు సుప్రీముకోర్టుపైనను ఆధారపడవలసి యుండునని గ్రంథకర్తగారు అభిప్రాయపడు చున్నారు.

ప్రజా ప్రభుత్వమున నివారక నిరోధము చాలా క్లిష్టమైన విషయము. ఈ గ్రంథకర్తగారు భారతదేశ స్థితిగతులను జాగ్రత్తగా గమనించి నివారక నిరోధక సమస్యలను నిష్పక్షపాతబుద్ధితోను సానుభూతితోను చర్చించినారని చెప్ప వచ్చును.

★ Preventive Detention in India. By David H. Bailey (Department of International Relations University of Denver, U S. A.). Published by Firma K. L. Mukhopadhyaya, Calcutta. Pages 140. Price Rs. 12/-

# ప్రజాప్రభుత్వ మంత్రుల బాధ్యతలు

ప్రజాప్రభుత్వ మనగా ప్రజలందరికిని బాధ్యతగల ప్రభుత్వమనియు కేవలము ధనవంతులకే గాక, దరిద్రులకు, రైతులకు, కూలివారికి గూడ వోటు హక్కు కలుగుట, అనగా తమ యభిప్రాయానుసారముగా ప్రవర్తించి తమ క్షేమలాభ ములకొరకు ప్రభుత్వము నడుపగల ప్రతినిధుల నెన్నుకొని వారిచే పరిపాలన చేయించుటయే యనియు ప్రజలెల్లరు గ్రహిం చునట్లు చేయవలెను.

ఈ ప్రభుత్వము తమదేయనియు పూర్వము తమపై స్వారిచేయుచుండిన నిరంకుశాధికారులు—కలెక్టరులు, తహ్సీలు దారులు, మేజస్ట్రేటులు, పోలీసువారు యిప్పటినుండి తమకు సేవకులై మెలగవలసియున్నదనియు, ఇందుకు వ్యతిరేకముగా ప్రవర్తించినచో వారిని తాము దండింపవచ్చుననియు ప్రజలు తెలుసుకొనునట్లు చేయవలెను. దేశముయొక్క భాగ్యభోగ్యము లెల్ల జనసామాన్యము అనుభవించుటకు హక్కు కలదనియు, విద్యావైద్య సహాయములు చేయుడని, అజ్ఞానము బాపుడని, దారిద్ర్యము మాన్పుడని ప్రభుత్వవర్గమును కోరుటకు తమ కధి కారము కలదను సంగతి నీ ప్రభుత్వమంత్రులు ప్రజలకు స్పష్ట ముగా చెప్పవలెను. దేశము నావరించియున్న ఈ గాఢమైన అవిద్యాంధకారము, ప్రజల నావరించియున్న అధికారులను జూచిన భయముపోయినగాని, ప్రజలకు కలిగిన స్వల్ప అధికార ములు, ఈ వోటుహక్కులు, వారు తమలాభముల కొరకు విని యోగించుకొని బాగుపడజాలరు. అవియన్నియు ధనికులకే

లాభము కలిగించును గాని బీదలకు లాభింపవు. కూలివాడు ఎప్పటికి కూలివాడుగానే యుండునుగాని ప్రభుత్వమును నడుపగల రాజకీయ హక్కుగల పౌరునిగా అభివృద్ధి నొందజాలడు. అందువలన నేటిమంత్రులు యిప్పటికైనను తమధర్మమును గుర్తెరిగి దేశసమస్యలెల్ల పరిశీలించి క్షేమలాభములకు వలసిన సంస్కరణలెల్ల చేయుటయేగాక, అవి అమలు జరుగుచున్నదీ లేనిదీ కనిపెట్టి చూడవలెను. ఇట్లు తల్లి శిశువును సంరక్షించునట్లు మంత్రులు ప్రజలను కాపాడి పరిశీలించవలెను. లేనిచో నీ నోరులేని ప్రజలు మఱల అజ్ఞానమున, భయమున మునిగి పైకి రాలేక అగాధములో పడిపోవుదురు.

కాంగ్రెసు ప్రభుత్వము చేయవలసిన మొదటిపని యీ ప్రజల అవిద్యాంధకారమును తొలగించుట, శక్తుల నుపయోగించుట. తమకు కొన్ని హక్కులు కలవను జ్ఞానము ప్రజలకు కలిగింపవలెను. ఇది చేయనిచో నీ ప్రభుత్వము వలని లాభము ప్రజలు పూర్తిగా పొందజాలరు. జిల్లాలోని వివిధశాఖల అధికారులెల్లరు వేలకువేలు రూపాయిలు జీత బత్తెములుగా పుచ్చుకొని ప్రజలపైన నిరంకుశాధికారము చలాయించుచు, దర్బారులలోని నవాబులవలెప్రవర్తించుచున్నారు. ఉద్యోగహోదాలోనుండు భారతీయులుకూడా 'దొర'గారని పిలిపించుకొనుచు, పాటకపు జనముయొక్క కష్టసుఖములు తెలిసికొని వారిబాధలు నివారణ చేయకపోవుట యట్లుండ, వారితో మాటలాడక వారిని తమ బంగళాదగ్గరకుకూడ రానీయక, వారి బిళ్ళబంట్రోతులను కాపలాయుంచి, మానవ్రతులై అధికార రోగపీడిత బధిరాంధక శవములవలె నుండు పద్ధతి యింకను జరుగుచునేయున్నది.

వీరినిచూచి ప్రజలు భయపడుచునేయున్నారు. ప్రజలకు క్షేమము కలుగవలెనన్నచో నీ దుష్టవిధానము పోవలెను. ఈ యుద్యోగులెల్లరు తమ పర్యటనములందు తమతమ కార్యాలయములు చేయుపనియు, అందువలన ప్రజలు పొందదగిన సహాయమునుగూర్చి తెనుగున ప్రతిగ్రామములో కూడా ఉపన్యసింపవలెననియు, ప్రజలడుగు ప్రశ్న లన్నిటికిని వీరు తెనుగున సమాధానము జెప్పవలెననియు, ఇందుకొరకొక దినచర్య పుస్తక ముంచవలెననియు దానిని పై యధికారులు తనిఖీ చేయుచుండవలెననియు, జీతవృద్ధులందు, ప్రమోషనులందు నీ దినచర్యల పుస్తకములనుబట్టి వీరు చేసినట్లు కనబడు ప్రజా సేవయే వీరి యర్హతకు సాక్ష్యముగా గైకొనబడునట్లు ఉద్యోగ నిబంధనలను మార్చవలెను. అట్లు చేసినగాని నిరంకుశ సంప్రదాయమునందు మెలగిన ఈ 'దొరలు' ప్రజలకు నిజముగా సేవజేయరు. నేటివార్షిక నివేదికలవలె కేవలము బూటకపు కార్యక్రమముల వివరణ గాకుండా నిజముగా వీరు సరిగా పని చేసి ప్రజాసేవచేయుచున్నారో లేదో కనిపెట్టి చర్యగైకొనుటకు మంత్రులు వీరిపనిని తనిఖీచేయుటకు ప్రత్యేకముగా కొందరుద్యోగులను నియమించవలెను. అంతటితో తృప్తిజెందక దేశ ప్రజలయొక్క క్షేమలాభములకొఱకు పనిచేయు రాష్ట్రీయకాంగ్రెస్ కమిటీలకును, బాధ్యతతో వర్తించు ఇతర ప్రజాసంఘములకును గూడ ప్రభుత్వశాఖలందలి అన్ని వ్యవహారములను తనిఖీచేయుటకు, సంస్కరణములను గూర్చి సూచించుటకు తగు అవకాశ మివ్వవలెను. అట్లు చేయఁబడిన సూచనలను మన్నించి ఆ సంస్కరణములు చేయవలెను. ఇట్లు

చేసినచో మంత్రులు నిర్ణయించు ప్రజాసేవ చక్కగా నెరవేర గలదు.

కాంగ్రెసు సంఘములుగూడ చాల జాగ్రత్తగా ప్రవర్తించవలెను గాని తొందరపడరాదు. నేటి జిల్లాకాంగ్రెసు సంఘములుగూడ సంస్కరింప బడవలెను, ఏలననగా, దీనిలో స్వార్థపరులు చేరగా పార్టీలు బయలుదేరి పూర్వపు జస్టిసు పార్టీలను తలదన్నుచున్నవి.

నేడు మన కాంగ్రెసు ప్రభుత్వమువారు హెచ్చుగా శాసన నిర్మాణములో నిమగ్నులైనారు. ఇది చక్కగానే యున్నది. కాని వెంటనే తీరిక చేసుకొని తక్కిన రాష్ట్రములందు వలెనే పరిపాలనశాఖలన్నియు వెంటనే సంస్కరించి పరిపాలించుట యావశ్యకము. మరియు ఇతర సంస్కరణలను గూడ త్వరణము చేయవలెను.

నేటి ప్రాథమిక పాఠశాలలందు పనిచేయు ఉపాధ్యాయులు విద్యాగంధము లేక, నీతి నియమములు లేక వేరే మార్గమున బ్రదుకలేనిచో బడిపంతులు ఉద్యోగము చేయుటకు వచ్చి ఇనస్పెక్టర్లకు పిండివంట భోజనములిడి లంచమిచ్చి బ్రతుకువారుగా నున్నారు. చాలమంది పంతులమ్మలకు వర్ణక్రమము రాదు. ఇటీవల విద్యాధికారి "స్టేటం" గారు ప్రకటించిన నివేదికలో చెప్పబడిన ప్రాథమిక పాఠశాలలందలి ఘోరాన్యాయములందానంతమైన నతిశయోక్తి లేదు. ఆ లోపముల వలన మన ప్రాథమిక విద్యావిధానము పుచ్చిపోయి మన విద్యార్థులు పాడగుచున్నారు. దానిని వెంటనే సంస్కరించుట

మన మంత్రుల కర్తవ్యము. నేటి పంతుళ్ళ యొక్కయు పంతు లమ్మలయొక్కయు శక్తి సామర్థ్యములను వెంటనే పరీక్షజరిపి జూచి తగని వారిని తీసివేసి మంచివారిని నియమించుట అత్యం తావశ్యకము. భారతదేశప్రభుత్వమును చేయవలసిన పౌరులను తయారు చేయవలసిన విద్యావిధానమును వెంటనే నిర్ణయించి అమలులో పెట్టవలయును. ఎన్ని శాసనములు చేసినను సంస్క రణములు గావించినను ఇది చేయనిదే మనము బాగుపడము.

ప్రభుత్వ వైద్యాలయములందు బీదజనులకు మందుల పేరు చెప్పి ఏదో రంగునీళ్ళ నిచ్చి పంపుటయు, వీరికొఱకు కొన్న పాలు అధికారులు త్రాగుటయు, వీరి కేర్పడిన వైద్య సహాయము ధనికుల కిడుటయు లంచముల పద్ధతియు వెంటనే నిర్మూలింపవలెను. సహకార శాఖలోను, వ్యవసాయ పారిశ్రా మిక శాఖలందును ప్రజాసేవ పేరున జరుపబడుచున్న కపట నాటకము నంతమొందించి ఆ శాఖోద్యోగులు ప్రజలకునిజమైన సేవచేయునట్లు చూడవలెను.

మన కాంగ్రెసు మంత్రులు దేశదారిద్ర్యము మాన్పు టకు చేయవలసిన ప్రథమ చికిత్స గాఢముగా దేశము నావ రించియున్న అవిద్యాంధకారమును తొలగించుటయే. అట్లు చేసిననే ప్రజలు కన్నులు తెరచి తమ దుస్థితిని, ప్రపంచము లోని అభివృద్ధినిగాంచి బాగుపడుటకు ప్రయత్నింపగలరు. పాఠ శాలలు,గ్రంథాలయములు,ఉపన్యాసములు, సినిమా, రేడియో ప్రదర్శనములు మొదలగు సమస్త నూతన సాధనములచేతను జనులలో విద్యావ్యాప్తిని గావింపవలెను. ప్రభుత్వోద్యోగు

లెల్లరు ప్రజలకీ విషయములను బోధింపవలెను. ప్రజలకు శౌచపద్ధతులు, పౌరస్వత్వ పద్ధతులు ఈ మార్గములద్వారా వెంటనే బోధించవలెను.

దేశసంపద నభివృద్ధిచేయుటకు, ప్రజల ఆదాయమును హెచ్చుచేయుటకును ప్రయత్నించవలెను. వ్యవసాయమునందు నూతన పద్ధతుల నవలంబించవలెను. సాగుచేయవలసిన భూమి నంతయు సాగుచేయవలెను. మంచి ఎరువులు పరికరములు ఉపయోగించవలెను. లాభకరములగు క్రొత్తపంటలను వేయుట మొదలిడవలెను. పంటలను నిలువజేసి లాభసాటి ధరలకు విక్రయించుట కవకాశము కలిగింపవలెను. వ్యవసాయపు పనులకు వలసిన ధనమును చౌక వడ్డీలకు సులభసాధ్యము చేయవలెను. రైతులు కోర్టులలో దిగి పాడుకాకుండా మాధ్యస్థ తీర్మాన పద్ధతి ప్రారంభింపవలెను. సంవత్సరము పొడుగున పని లేని కాలమును వ్యర్థపరచు రైతులకు, వారికుటుంబములకు తీరిక వేళలందు పని కలిపించి వారి యాదాయమును వృద్ధిపరుపగల పాడి పంటలకు సంబంధించిన పరిశ్రమలు, అనుగత గృహ పరిశ్రమలు చేతిపనులు నెలకొల్పవలెను.

దేశములోని ముడిపదార్థములను ఖనిజ జంతు వృక్ష సంబంధపు టుత్పత్తులను పాడిపంటలను పుట్టినవి పుట్టినట్లు విదేశములకు ఎగుమతిచేసి అధికవెలలకు వానిని తయారు వస్తువులుగా దిగుమతి చేసికొను పద్ధతిమాని నిర్మాణకౌశలముచేతను, మానవ పరిశ్రమవలనను, యంత్రసాహాయ్యమునను సరకుల నెల్ల కొంచెముగనో గొప్పగనో నిర్మాణ వస్తువులుగ మార్చి

ఎగుమతి చేయుచు మనము సులభముగా చేసికొనలేని వస్తువులను మాత్రమే దిగుమతి చేయవలెను. ఇందులకు వలసిన కార్ఖానాలు యంత్రాలయములు స్థాపించి నడుపవలెను.

అర్థోత్పత్తి యందు వాణిజ్య వ్యవసాయ పరిశ్రమలందు సమష్టి కృషి, సమష్టి ప్రయత్నము, సమష్టిలాభమునుగల సహకార పద్ధతులను ప్రజలయందు వ్యాపింపజేయవలయును.

దేశప్రజల జనసత్వముల నభివృద్ధి గావించి జీవనాధార సౌఖ్యము, ఆరోగ్యము కలిగింపవలెను. ఇతర దేశములందు వలెనే ఆరోగ్య సూత్రములను, రోగనివారణోపాయములను బోధింపవలెను. రోగచికిత్స కుచిత వైద్య సహాయము గావింపవలెను. జబ్బుపడి లేచినవారికి విశ్రాంతిగృహములను ఉచిత జీవనోపాధియు కలిగింపవలెను. అనాథులకు, అశక్తులకు, వృద్ధులకు, దరిద్రులకు, బాల బాలికలకు, ప్రసూతి స్త్రీలకు, వ్యాధిగ్రస్తులకు దారిద్ర్యమున మరణింపకుండుటకు వలసిన జీవనభృతి, ఉపకార వేతనములు ఇతర సాహాయ్యమును గావింపవలెను.

ఈ సంస్కరణల నెల్ల చేయుటలో మన మంత్రులు తమ క్రిందియధికారులు తాము నిర్ణయించిన విధానముల నెల్ల చక్కగా నెరవేర్చుచున్నారో లేదో అందలి లాభములు జనసామాన్యములు పొందగలుగుచున్నారో లేదో కూడా కనిపెట్టుచుండవలెను.

# సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| VI | 3 | ప్రజాప్రతినిధు | ప్రజ |
| VI | 15 | ప్రజాప్రతినిధు | ప్రజ |
| 9 | 6 | 400 | 3250 |
| 9 | 8 | 620 | 630 |
| 37 | 9 | నుబట్టి | కనిపెట్టి |
| 55 | 13 | 7-5 | 7-5 (బి) |
| 84 | 9 | నిప్పు | విప్పు |
| 97 | 1 | జనన | భోజన |
| 113 | 12 | కంటిక | కంటక |
| 116 | 13 | లైన | లై |
| 118 | 7 | 1993 | 1963 |
| 133 | 13 | కత్తుల | కుసర్వాకత్తు |

# ప్రజాప్రభుత్వము

## అకారాది విషయసూచిక

# కృతజ్ఞత

ఈ గ్రంథ రచనమునందు నాకు ముఖ్యముగా తోడ్పడిన గ్రంథములను పట్టికలో పేర్కొని యున్నాను. ఆ గ్రంథకర్తలకు కృతజ్ఞుడను. ఈ గ్రంథములోని కొన్ని భాగములు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, కృష్ణాపత్రిక లలో ప్రకటింపబడినవి. ఆ పత్రికాధిపతులకు కృతజ్ఞుడను.

—రచయిత

# BIBLIOGRAPHY


BRITAIN : An official Hand book prepared by the Central office of Information London 1965.

SIR IVOR JENNINGS : The British Constitution; The Law and the constitution; The Queen's Government; Parliament; Party Politics.

TAYLOR ERIC : The House of Commons at Work.

ARCHER PETER : The Queen's Courts.

HAYNES : The Practitioner's Hand book of social services.

National Council of Social Service; Public Social services - a Hand book of information.

SIR COURTNEY ILBERT : Parliament.

Churchill by his contemporaries edited by Charles Eade.

JOHN MORLEY : Life of W. E. Gladstone.

A. V. DICEY : The Law of the Constitution.

ALLEN FREDERICK LEWIS : The Big Change - America transforms itself. 1900-1950.

PARRINGTON VERNON : Main currents in American thought.

ALEXANDER BRADY : Canada

Speeches and writings of Sir Winston Churchill, C. R. Atlee, John Stratehy.

V. N. SHUKLA : Constitution of India.

DAVID H. BAYLEY : Preventive Detention in Indi